

# భక్తివేదాంత బుక్ ట్రస్ట్

అంతర్జాతీయ కృష్ణ చైతన్య సంఘం సంస్థాపకాచార్యులు

పూజ్యశ్రీ ఏ.సి. భక్తివేదాంత స్వామి ప్రభుపాదులవారు





అంతర్జాతీయ కృష్ణ చైతన్య సంఘ సంస్థాపకాచార్యులు

పూజ్యశ్రీ ఏ.సి. భక్తివేదాంత స్వామి ప్రభుపాదుల వారి

# కృష్ణుని చేరే మార్గం







## కృష్ణ చైతన్య మార్గం - ప్రధాన సూత్రాలు

1. ప్రామాణికమైన ఆధ్యాత్మిక శాస్త్రాన్ని అనుసరించినట్లైతే మన ఆందోళనల నుండి విముక్తులమై పరిశుద్ధమైన, నిరంతరమైన, ఆనందమయమైన కృష్ణ చైతన్యాన్ని ఈ జీవితంలోనే మనం సాధించగలము.

2. మనం మన దేహాలము కాము. సనాతనమైన ఆత్మ స్వరూపులము. కృష్ణ భగవానుని తాలూకు అంశలము. అందుచేత మనం అందరం సోదరీ సోదరులము. కృష్ణుడు మన కందరికీ ఒకే ఒక పరమపిత.

3. సనాతనుడు, సర్వజ్ఞుడు, సర్వవ్యాపి, సర్వశక్తిమంతుడు, సర్వమనోహరుడు అయిన కృష్ణుడు దేవాది దేవుడు. సర్వప్రాణి కోటికీ బీజావాపం చేసిన తండ్రి ఆయన. సర్వసృష్టికీ స్థితికారకుడు ఆయన!

4. ప్రపంచంలోని సర్వమత ఉద్గ్రంథాలలోనూ పరమసత్యం నిక్షిప్తం అయి ఉన్నమాట నిజం. అయినా మిక్కిలి సనాతనమైన, అపౌరుషేయాలైన ఉద్గ్రంథాలతో కూడింది వైదిక సారస్వతం. ఆ వైదిక సారస్వతంలో భగవద్గీత భగవానుని చేతనే స్వయంగా నుడువబడింది.

5. వైదిక విజ్ఞానాన్ని నిస్స్వార్థపరుడైన, స్థిరచిత్తంతో శ్రీకృష్ణుణ్ణి ఆరాధించే ప్రామాణికుడైన గురువువద్ద మనం అధ్యయనం చెయ్యాలి.

6. మనం ఆహారం తీసుకునే ముందు ఆ ఆహారాన్ని భగవానునికి నివేదన చెయ్యాలి. అప్పుడు కృష్ణుడు ఆ ప్రసాదం రూపంలో మనల్ని పరిశుద్ధులను చేస్తాడు.

7. మనం సర్వ కార్యాలనూ కృష్ణార్పణ బుద్ధితోనే చెయ్యాలి. మన స్వంత ఇంద్రియాల తృప్తికోసం ఏదీ చేయరాదు.

8. ఈ కలియుగంలో పరిపక్వమైన భగవద్ భక్తిని సాధించడానికి ఒకే ఒక మార్గం: భగవన్నామ సంకీర్తనం. భగవంతుని స్మరణకు అత్యంత సులభమైన మంత్రం :

**హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే**
**హరే రామ హరే రామ రామ రామ హరే హరే**





# కృష్ణుని చేరే మార్గం

Rs 10=-

పరమపూజ్యశ్రీ శ్రీమత్ ఏ.సి.భక్తివేదాంత స్వామి ప్రభుపాదుల వారి రచనలు :

భగవద్గీత యథాతథము
శ్రీమద్భాగవతము (18 సంపుటములు)
శ్రీ చైతన్య చరితామృతము (9 సంపుటములు)
శ్రీ చైతన్య మహాప్రభు బోధామృతము
దేవాదిదేవుడు శ్రీకృష్ణభగవానుడు
భక్తి రసామృతము
ఆత్మసాక్షాత్కార శాస్త్రం
కుంతీ మహారాణి ఉపదేశములు
దేవహూతి కుమారుడైన కపిలుని ఉపదేశములు
శ్రీ ఈశోపనిషత్తు
ఉపదేశామృతం
ఉత్తమ ప్రశ్నలు - ఉత్తమ సమాధానములు
గ్రహాంతర సులభయానం
కృష్ణ చైతన్యమే సర్వోత్తమ యోగం
ప్రకృతి నియమాలు - దోషరహిత న్యాయము
యోగసిద్ధి పథం
జీవం నుండి జీవం
యోగ పరిపూర్ణత
జనన మరణాలకు అతీతంగా...
కృష్ణుని చేరే మార్గం
రాజవిద్య
పునరావృత్తి
కృష్ణ చైతన్య సాధన
కృష్ణ చైతన్యం అద్వితీయ వరప్రసాదం
దైవనాగరికత
సనాతన ధర్మం
హరే కృష్ణ సవాల్
భగవద్దర్శనం (సంస్థాపకుని ఆధ్యాత్మిక పత్రిక)

శ్రీ గురు గౌరాంగౌ విజయేతామ్

# కృష్ణుని చేరే మార్గం

## On the way to Krishna


అంతర్జాతీయ కృష్ణ చైతన్య సంఘ సంస్థాపకాచార్యులు
పరమపూజ్యశ్రీ శ్రీమత్
ఏ.సి. భక్తివేదాంత స్వామి ప్రభుపాదులు వారు








ప్రకాశకులు :
భక్తివేదాంత బుక్ ట్రస్ట్
హరే కృష్ణ ల్యాండ్, నాంపల్లి స్టేషన్ రోడ్
హైదరాబాదు - 500 001

ఈ పుస్తకంలోని విషయాలపై ఆసక్తి గల పాఠకులు భక్తివేదాంత బుక్ ట్రస్ట్ వారి 'కార్యదర్శి'ని ఈ క్రింది చిరునామాకు సంప్రదించగలరు :

**భక్తివేదాంత బుక్ ట్రస్ట్**
హరే కృష్ణ ల్యాండ్, నాంపల్లి స్టేషన్ రోడ్
హైదరాబాదు - 500 001

On the way to Krishna (Telugu)



*అనువాదం* :
**శ్రీ తిరుమల రామచంద్ర, డా.లిట్, విజయ సర్వలక్ష్మి**
*సంపాదకులు* :
**బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు**

1st printing in India : 5,000 copies
2nd to 16th printing : 1,00,500 copies
17th printing, November 2007 : 10,000 copies



# విషయ సూచిక



# 1. ఆనందానికి రాచబాట

మనలో ప్రతి ఒక్కరం సుఖం కోసం, ఆనందం కోసం తాపత్రయ పడుతూ ఉంటాం. వాస్తవంగా నిజమైన ఆనందం అంటే ఏమిటో మనకు తెలియదు. నిజం చెప్పాలంటే సుఖంగా, ఆనందంగా ఉన్నవాళ్ళు చాల కొద్దిమందే ఉంటారు. ఎందుచేతనంటే నిజమైన ఆనందం చేకూర్చే స్థానం తాత్కాలిక విషయాలకు అతీతంగా ఉంటుందని గ్రహించిన వారు చాలా తక్కువ మంది. శ్రీకృష్ణుడు అర్జునునికి భగవద్గీతలో వివరించి చెప్పింది ఈ నిజమైన ఆనందం గురించే!

సాధారణంగా ఆనందం మన జ్ఞానేంద్రియాల ద్వారా అనుభూత మవుతుంది. రాతికి జ్ఞానేంద్రియాలు ఉండవు. కాబట్టి దానికి సుఃఖ దుఃఖాల అనుభూతి ఉండదు. వికాసం లేని చైతన్యం కంటె వికసించిన చైతన్యం సుఖ దుఃఖాలను మరింత గాఢంగా గ్రహించగలదు. చెట్లకు చైతన్యం ఉంది. కాని, ఆ చైతన్యం వికసించలేదు. అన్ని రకాల వాతావరణాలకు తట్టుకుని చెట్లు చాలా కాలం జీవించగలవు. కాని దుఃఖాలను అనుభవించడం వాటికి చేతకాదు. ఏ మనిషినైనా రెండు మూడు రోజులు చెట్టులాగ ఒకేచోట నిలబడి ఉండమని అంటే అతడు అలా నిలబడలేడు. కారణం అతని వికసిత చైతన్యం. సారాంశం ఏమిటంటే ఆయా జీవుల చైతన్య వికాసపు స్థాయిని బట్టి సుఖానుభవం గాని, దుఃఖానుభవం గాని ఉంటుంది.

నిజానికి ఈ భౌతిక ప్రపంచంలో మనం అనుభవిస్తున్న సుఖం సుఖం కానేకాదు. చెట్టుకు మాట్లాడే శక్తి ఉన్నట్లయితే, మనం ఒక చెట్టును సమీపించి "నువ్వు సుఖంగా ఉన్నావా?" అని అడిగినప్పుడు, ఆ చెట్టు "అవును. సుఖంగా ఉన్నాను. సంవత్సరం అంతా ఇక్కడే నిలబడి గాలినీ,

మంచునీ చక్కగా అనుభవిస్తున్నాను" అని అనవచ్చును. అది ఆ చెట్టుకు సుఖం అయితే కావచ్చును. కాని అదే మనిషి విషయంలో చాలా తక్కువ స్థాయి అనుభవం. జీవులు చాలా రకాలున్నాయి. అనేక తరగతులవీ ఉన్నాయి. అలాగే వాటి సుఖానుభూతులలోను, సుఖభావనలోను కూడా భేదాలు ఉంటాయి. ఒక జంతువు తన తోడి జంతువు వధించబడడం చూసి కూడా గడ్డి మేస్తూనే ఉంటుంది. తరువాత తన వంతు వస్తుందని గ్రహించగల జ్ఞానం దానికి ఉండదు. తను సుఖంగా ఉన్నానని అనుకుంటుంది. కాని మరుక్షణమే తాను కూడా వధించ బడవచ్చునని గ్రహించ లేదు.

ఈ విధంగా సుఖాలలో పలు విధాలైన హెచ్చు తగ్గులు ఉంటాయి. అయితే అత్యుత్తమ సౌఖ్యం ఏది? దానిని గురించి శ్రీ కృష్ణుడు అర్జునునితో ఇలా చెప్పాడు:

సుఖ మాత్యంతికం య త్తద్ బుద్ధిగ్రాహ్య మతీంద్రియమ్
వేత్తి యత్ర న చైవాయం స్థిత శ్చలతి తత్త్వతః

"ఆత్యంతికమైన సుఖ స్థితి (సమాధి) లో మనిషి ఆధ్యాత్మికేంద్రియాల ద్వారా అనుభవించే హద్దులేని దివ్యానందంలో ఉంటాడు. ఆ విధంగా ప్రతిష్ఠితుడైన వాడు ఎప్పుడూ సత్యాన్ని విడువడు." (భ.గీ. 6.21)

'బుద్ధి' అంటే తెలివి. సుఖాన్ని అనుభవించా లనుకునేవాడు తెలివి గలవాడు కావాలి. పశువులకు వికసించిన బుద్ధి ఉండదు గనుక అవి మనుష్యులలాగ జీవితాన్ని అనుభవించలేవు. మానవుడు మరణించిన తరువాత కూడా అతని చేతులు, ముక్కు, కళ్ళు, ఇంకా ఇతర శరీర భాగాలు కనిపిస్తూనే ఉంటాయి. కాని ఆ మనిషి ఇక ఏ సుఖ దుఃఖాలను అనుభవించలేడు. ఎందుచేత? ఆ అనుభవించే శక్తి, ఆ చైతన్యాగ్ని కణం ఆ దేహం నుంచి లేచి పోయింది. కనుక ఆ శరీరానికి ఇక ఆ శక్తి ఉండదు.



కొంచెం తెలివిగా, మరికొంచెం లోతుగా ఈ విషయం గురించి ఆలోచిస్తే అనుభవించేది భౌతిక శరీరం కాదని, శరీరం లోపల ఉండే ఆ చైతన్యాగ్ని కణమే అని అతనికి తెలుస్తుంది. ఈ శరీరంలోని జ్ఞానేంద్రియాల ద్వారా ఆనందిస్తున్నానని ఎవరైనా అనుకున్నా, నిజానికి ఆ ఆనందిస్తున్నది ఆ చైతన్య కణమే. ఆ చైతన్య కణానికి సుఖాన్ని అనుభవించగల సామర్థ్యం ఉంది. కాని అది పాంచభౌతికమైన ఆవరణంతో కప్పబడి ఉండడం వలన అది ఎల్లప్పుడు వ్యక్తం కాదు. మనకు ఆ జ్ఞానం ఉన్నా లేకపోయినా ఆ చైతన్య కణం లేకపోతే మాత్రం ఈ శరీరానికి సుఖానుభవం సాధ్యం కాదు. ఒక అందగత్తె మృత శరీరాన్ని ఒకడికి ఇద్దామనుకున్నామనుకోండి. అతడు దానిని తీసుకుంటాడా? తీసుకోడు. ఎందుచేత? చైతన్య కణం ఆ శరీరాన్ని విడిచి పోయింది గనుక. దేహంలో ఉండి ఆ చైతన్య కణం ఆనందాన్ని అనుభవిస్తూ ఉండడమే కాక ఈ దేహాన్ని సంరక్షిస్తూ కూడా ఉంటుంది. ఆ చైతన్య స్ఫులింగం లేచి పోగానే దేహం కుళ్ళి చెడిపోతుంది.

జీవుడు ఆనందిస్తున్నాడు అంటే అతనికి కూడా జ్ఞానేంద్రియాలు ఉంటాయన్న మాట! లేకపోతే ఎలా ఆనందిస్తాడు? పరిమాణంలో జీవాత్మ అణువే అయినా నిజంగా అనుభవిస్తున్నది జీవాత్మే అని వేదాలు కూడా ధ్రువీకరిస్తున్నాయి. ఆత్మను కొలవడం గాని, తూచడం గాని కుదురదు. అంతమాత్రం చేత దానికి పరిమాణం లేదని అర్థం కాదు. ఒక పదార్థం మనకు ఒక చిన్న చుక్కలాగ కనిపించవచ్చును. దాని పొడవు, వెడల్పులు కూడ కనపడక పోవచ్చును. కాని సూక్ష్మ దర్శినితో చూస్తే దానికి కూడా పొడుగు వెడల్పులు కనిపిస్తాయి. అలాగే జీవాత్మకు కూడా కొలతలు ఉన్నాయి. అయితే వాటిని మనం చూడలేము. మనం దుస్తులను కొనుక్కునేప్పుడు మన శరీరానికి సరిపోయే వాటినే కొనుక్కుంటాము. అలాగే జీవాత్మకు ఏదో ఒక రూపం ఉండే ఉంటుంది. లేకపోతే అది

ధరించడానికి ఒక భౌతిక శరీరం ఎలా ఏర్పడుతుంది? సారాంశం ఏమిటంటే ఆ చైతన్య కణం నిరాకారం కాదు. అది నిజంగా ఒక పురుషుడు. దేవుడు ఒక పురుషుడు. జీవాత్మ దేవాదిదేవుని అంశం కనుక అది కూడ ఒక పురుషుడే! తండ్రికి ఒక స్వరూపం, వ్యక్తిత్వం ఉంటే కొడుకుకు కూడా ఉంటాయి గదా! అలాగే కొడుకుకు అవి రెండూ ఉంటే తండ్రికి కూడా ఉన్నట్లు మనం భావించ గలము. దేవాదిదేవుని పుత్రులమైన మనకు ఒక స్వరూపం, వ్యక్తిత్వం ఉన్నప్పుడు మన తండ్రికి అవి లేవని ఎలా అనగలము?

'అతీంద్రియమ్' అంటే నిజమైన ఆనందాన్ని చవి చూడగలుగడానికి ముందు మనం ఈ భౌతిక ఇంద్రియ విషయాలకు అతీతులము కావాలి. 'రమంతే యోగినో ఽనంతే సత్యానంద చిదాత్మని' - ఆధ్యాత్మిక జీవితాన్ని సాధించగోరే యోగులు కూడ లోపల ఉన్న పరమాత్మపై తమ దృష్టిని కేంద్రీకరించడం వలన ఆనందాన్ని అనుభవిస్తున్నారు. అందులో సుఖం గాని, ఆనందం గాని లేకపోతే ఇంద్రియాలను నిగ్రహించడానికి అన్ని కష్టాలు పడడంలో అర్థం ఏమిటి? అంతగా కష్టపడి యోగులు అనుభవిస్తున్న ఆ సుఖం ఎలాంటిది? ఆ సుఖం అనంతం - అంతం లేనిది. అదెలాగ? జీవాత్మ నిత్యుడు, దేవదేవుడు నిత్యుడు, కాబట్టి వారిరువురి మధ్య ప్రేమానురాగాల ఆదాన ప్రదానాలు కూడ నిత్యమే! నిజంగా తెలివైన వాడు అశాశ్వతమైన భౌతిక శరీర సౌఖ్యాలకు దూరంగా ఉంటాడు. ఆధ్యాత్మిక జీవితంలోనే నిజమైన ఆనందం పొందుతాడు. పరమ పురుషునితో కలిసి ఆధ్యాత్మిక జీవితంలో పాలు పంచుకోడాన్ని 'రాసలీల' అంటారు.

బృందావనంలో గోపికలతో శ్రీకృష్ణుని 'రాసలీల' ను గురించి మనం తరచు వింటూ ఉంటాము. అది భౌతిక దేహాల మధ్య ఉండే సాధారణ సంబంధం వంటిది కాదు. అది అలౌకిక శరీరాల ద్వారా వినిమయం చేసుకునే భావానుభవాలకు సంబంధించింది. దీనిని గ్రహించడానికి కొంత



బుద్ధి అవసరం. నిజమైన ఆనందం ఏదో తెలిసికోలేని మూర్ఖుడు భౌతిక ప్రపంచంలోని సౌఖ్యాన్ని వాంఛిస్తాడు. చెఱకు గడ ఎరుగని మనిషిని గురించి భారత దేశంలో ఒక కథ ప్రచారంలో ఉంది. చెఱకుగడ నమిలితే చాలా తియ్యగా ఉంటుందని అతనికి ఎవరో చెప్పారు. "అలాగా? అది ఎలా ఉంటుంది?" అని అడిగాడట. "అది వెదురు గడలా ఉంటుంది" అన్నారు వారు. ఇక కనబడిన ప్రతి వెదురు ముక్కనూ నమిలి చూడడం మొదలుపెట్టాడు. అలా చేస్తే చెఱకు తీపిని అతడు ఎలా రుచి చూడగలడు? అదే విధంగా మనం కూడా ఒక విధానం అంటూ లేకుండా ఈ భౌతిక శరీరాన్ని నమలడం ద్వారా (అంటే భౌతిక సుఖాలను అనుభవించడం ద్వారా) ఆనందాన్ని పొందాలని ప్రయత్నిస్తున్నాము. కాని దాని వలన మనకు సుఖమూ లేదు, ఆనందమూ లేదు. అయితే తాత్కాలికంగా సుఖ భావన కొంత కలుగవచ్చును. కాని అది నిజమైన సుఖం కాదు. అది క్షణికం మాత్రమే! అది ఆకాశంలో తళుకుమని మెరసి ఒక్క క్షణం మాత్రమే కనిపించే మెరుపు లాంటిది. నిజమైన మెరుపు ఆకాశానికి ఆవల ఉంది. మనిషి నిజమైన ఆనందం ఏమిటో ఎరుగని వాడవడం వలన పెడదారిని పడుతున్నాడు.

నిజమైన ఆనందంలో తనను తాను ప్రతిష్ఠించుకోవాలంటే సరియైన విధానం కృష్ణ చైతన్యం అవలంబించడం. కృష్ణ చైతన్యం ద్వారా మనం క్రమంగా నిజమైన తెలివిని అభివృద్ధి చేసికోగలుగుతాము, ఆధ్యాత్మికాభివృద్ధిని సాధించిన కొలదీ ఆధ్యాత్మికానందానుభవాన్ని సహజంగానే పొందగలుగుతాము. ఆధ్యాత్మికానందాన్ని చవి చూడడం ప్రారంభించగానే భౌతికానందాన్ని నిరసించడం మొదలు పెడుతాము. పరమ సత్యాన్ని గ్రహించడంలో ప్రగతి సాధించిన కొలదీ సహజంగానే మనకు ఈ అసత్యసుఖం పట్ల ఆసక్తి తగ్గిపోతుంది. ఏదో విధంగా ఎవరైనా ఈ కృష్ణ చైతన్య స్థాయిని అందుకోగలిగితే కలిగే ఫలితం ఏమిటి?

యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే

"దీనిని పొందిన తరువాత అతడు ఇంతకంటె అధిక తరమైన లాభం ఇంకొకటి లేదని భావిస్తాడో, అటువంటి స్థితిలో ప్రతిష్ఠితుడై ఉన్నప్పుడు ఘోర దుఃఖాలు ఎదురైనా అతడు చలించడు." (భ.గీ.6.22)

అటువంటి దశకు చేరుకున్న వారికి ఇతర సిద్ధులు నిస్సారంగా కనిపిస్తాయి. ఈ భౌతిక ప్రపంచంలో మనం ఎన్నిటినో సాధించడానికి ప్రయత్నిస్తున్నాము. ఉదా: ధనం, స్త్రీలు, కీర్తి, అందం, జ్ఞానం మొదలగునవి. అయితే మనం కృష్ణ చైతన్యంలో ప్రవేశించగానే "ఆహా! ఇంతకంటె ఉత్తమమైన సిద్ధి వేరొకటి లేదు కదా!" అనుకుంటాము. కృష్ణ చైతన్యం ఎంతటి శక్తి కలదంటే దాని రుచి ఏ కొంచెం ఆస్వాదించినా మహా విపత్తుల నుంచి అది మనలను రక్షిస్తుంది. కృష్ణ చైతన్యం ఆస్వాదించడం ప్రారంభించగానే ఇతర ఆనందాలు, సిద్ధులూ, అన్నీ నిస్సారాలుగా కనిపించడం ప్రారంభమవుతుంది. కృష్ణ చైతన్యంలో ఎవరైనా దృఢంగా నెలకొన్నట్లయితే ఎంత మహా విపత్తులైనా అతనిని చలింప జేయలేవు. భౌతిక ప్రపంచం ఆపదలకు, అపాయాలకు నెలవు. సహజంగానే జీవితంలో ఎన్నో ఆపదలు వస్తూ ఉంటాయి. వాటిని పొందడం మనకు ఇష్టం ఉండదు. మనం మూర్ఖులం కాబట్టి వాటితో రాజీ పడడానికి ప్రయత్నిస్తాము. కాని వాటిని జయించడానికి యత్నించము. కృష్ణ చైతన్యంలో శిక్షణ పొంది స్వగృహమైన శ్రీకృష్ణుని వద్దకు చేరడానికి ప్రయత్నిస్తే మనం ఆపదలను లెక్క చేయము. అప్పుడు మన దృక్పథం మారిపోతుంది: "ఆపదలు వస్తాయి; పోతాయి, వాటి దారిని అవి రానీ, పోనీ" అన్నట్లుంటుంది. భౌతిక వేదికమీద జీవిస్తూ నశించిపోయే వస్తువులతో నిర్మించబడిన ఈ స్థూల శరీరంతో తాదాత్మ్యం



అనుభవిస్తూ ఉన్నంతకాలం ఆ విధమైన దృక్పథాన్ని మనం సాధించలేము. కృష్ణ చైతన్యంలో ప్రగతి సాధించిన కొలది భౌతిక బంధాల నుంచి, దేహానికి సంబంధించిన ఉపాధుల నుంచి విముక్తులము అవుతాము.

శ్రీమద్భాగవతంలో ఈ భౌతిక జగత్తు (సంసారం) ఒక మహా సముద్రంతో పోల్చ బడింది. భౌతిక జగత్తులో కోట్ల కొలది గ్రహాలు అంతరిక్షంలో తేలుతూ ఉంటాయి. అట్లాంటిక్, పసిఫిక్ సముద్రాల లాంటివి వాటిలో ఎన్ని ఉంటాయో మనం ఊహించ లేము. నిజానికి భౌతిక జగత్తు అంతా జనన మరణాలతో కూడిన ఒక మహా దుఃఖ సముద్రం. ఈ అజ్ఞాన మహా సముద్రాన్ని దాటడానికి ఒక దృఢమైన నావ కావాలి. శ్రీకృష్ణుని పాదపద్మాలే ఆ బలమైన నావ. మనం వెంటనే ఆ నావ ఎక్కాలి. శ్రీకృష్ణుని పాదపద్మాలు చిన్నవి అనుకుని మనం తాత్సారం చేయకూడదు. సమస్త విశ్వం ఆయన పాదాలపైననే ఉంది. ఆయన పాదాలను ఆశ్రయించిన వారికి ఈ భౌతిక మహా సముద్రం ఒక ఆవుదూడ గిట్ట ద్వారా ఏర్పడే చిన్నగుంటలో నిలిచే కొద్దిపాటి జలంలా కనిపిస్తుంది. అలాంటి నీళ్ళ గుంటను దాటడం ఏ మాత్రం కష్టం కాదు కదా!

*తం విద్యాద్ దుఃఖ సంయోగ వియోగం యోగ సంజ్ఞితమ్*

"ఐహిక సంబంధాల వలన కలిగే దుఃఖాల నుంచి మనకు నిజమైన విముక్తి ఇదే." (భ.గీ. 6.23)

ఇంద్రియ నిగ్రహం లేకపోవడం వలననే మనం ఈ భౌతిక ప్రపంచంలో చిక్కుకుని ఉన్నాము. యోగ విధానం ఇంద్రియాలను జయించడానికే ఉద్దిష్టమైంది. ఏదో విధంగా ఇంద్రియాలను జయించ గలిగితే అప్పుడు మనం నిజమైన ఆత్మానందం వైపు ఉన్ముఖులం అవుతాము. జీవితాలను సార్థకం చేసికో గలుగుతాము.

స నిశ్చయేన యోక్తవ్యో యోగోऽనిర్విణ్ణ చేతసా

సంకల్ప ప్రభవాన్ కామాన్ త్యక్త్వా సర్వా నశేషతః
మనసైవేంద్రియ గ్రామం నివియమ్య సమంతతః

శనైః శనై రుపరమేద్ బుద్ధ్యా ధృతి గృహీతయా
ఆత్మ సంస్థం మనః కృత్వా న కించి దపి చింతయేత్

యతో యతో నిశ్చలతి మన శ్చంచల మస్థిరమ్
తత స్తతో నియమ్యైత దాత్మ న్యేవ వశం నయేత్

"మానవుడు ఏకాగ్రతతోను, నమ్మకంతోను యోగాభ్యాసంలో నిమగ్నుడై ఆ మార్గం నుంచి ఏ మాత్రం చ్యుతుడు కారాదు. 'అహంకారం' వలన జనించిన అన్ని భౌతిక వాంఛలను నిశ్శేషంగా విడిచి సర్వేంద్రియాలను నిగ్రహించి మనస్సు అధీనంలోకి తెచ్చుకోవాలి. క్రమంగా నిశ్చయాత్మకమైన బుద్ధితో సమాధి స్థితిని పొందాలి. ఈ విధంగా మనస్సును ఆత్మయందే స్థిరం చేయాలి. ఇతరమైన దేనిని మనస్సులోకి రానీయరాదు. చంచలమైన, అస్థిరమైన స్వభావం గల మనస్సు ఎక్కడెక్కడ పరిభ్రమిస్తున్నా మానవుడు దానిని వెనుకకు మళ్ళించి తిరిగి 'ఆత్మ' అధీనంలోకి తెచ్చుకోవాలి." (భ.గీ. 6.23-26)

మనస్సు ఎప్పుడూ కల్లోలితంగానే ఉంటుంది. అయితే మనం యోగాభ్యాసం చేయడం ద్వారా మన మనస్సును కచ్చితంగా కృష్ణ చైతన్యం వైపుకు మళ్ళించ గలుగుతాము. అనాదిగా జన్మ జన్మలుగా అలవాటు పడడం వలన మన మనస్సు కృష్ణ చైతన్యం నుంచి చ్యుతమై అనేక బాహ్య విషయాల వైపు పరుగులు పెడుతూ ఉంటుంది. ఈ కారణం వలననే ఎవరైనా కృష్ణ చైతన్యం మీద మనస్సును కేంద్రీకరించడానికి ప్రయత్నించి



నప్పుడు ఆరంభంలో చాలా కష్టంగా ఉంటుంది. కాని ఈ చిక్కులను అధిగమించ వచ్చును.

మనస్సు కలవరమై కృష్ణుని మీద నిలువక ఒక ఆలోచన నుంచి మరో ఆలోచన మీదకు పరుగులు పెడుతూ ఉంటుంది. ఉదాహరణకు మనం ఒక పని మీద ఉన్నప్పుడు పది, ఇరువై, ముప్పయి, నలభై, సంవత్సరాల క్రితం జరిగిన ఏవేవో సంఘటనలు ఆకస్మాత్తుగా, అకారణంగా మన మనస్సు అంతరాంతరాలలో నుంచి ఉబికి వస్తాయి. అవి అలా పైకి రావడం వలననే మన మనస్సు ఎప్పుడూ అశాంతిగా ఉంటుంది. మనం ఒక సరస్సును గాని, చెరువును గాని అల్లకల్లోలం చేస్తే అడుగున ఉన్న బురద నీరు పైకి వస్తుంది. అదే విధంగా మన మనస్సు కల్లోలంగా ఉంటే ఎన్నో ఏళ్ళ తరబడి స్తబ్ధంగా అడుగున పడివున్న ఆలోచనలు పైకి వస్తాయి. చెరువును అల్లకల్లోలం చేయకపోతే బురద అడుగుననే పడి ఉంటుంది. అలాగే మనసు విషయం కూడా! దానికి సరియైన ఉపాయం యోగాభ్యాసం. ఇది మనస్సును శాంతింప చేయడానికీ, ఆలోచనలను అణచివేయడానికీ ఉపకరిస్తుంది. మనసులో కల్లోలం లేకుండా చేయడానికి అనేక నియమాలు ఏర్పడ్డాయి. ఆ నియమాలను మనం అనుసరిస్తే క్రమ క్రమంగా మనస్సు స్వాధీనం అవుతుంది. మనో నిగ్రహానికి అనేక విధులు నిషేధాలు ఉన్నాయి. మనో నిగ్రహం అలవరచుకోవాలను కుంటే వాటిని అనుసరించాలి. అలా కాక తమ ఇష్టం వచ్చినట్లు ప్రవర్తిస్తే మనో నిగ్రహానికి అవకాశం ఉండదు. కృష్ణుని గురించి తప్ప ఇతర విషయాలను ఆలోచించని దశ వచ్చే వరకు మనస్సుకు పూర్తి శిక్షణను ఇస్తే, దానికి నిశ్చలత్వం, ప్రశాంతి ఏర్పడుతాయి.

ప్రశాంత మనసం హ్యేనం యోగినం సుఖ ముత్తమమ్
ఉపైతి శాంత రజసం బ్రహ్మభూత మకల్మషమ్

"నా మీద మనస్సు లగ్నం చేసిన యోగి యథార్థంగా ఉత్తమసుఖం పొందుతాడు. అతడు రజో గుణానికి అతీతుడై బ్రహ్మంతో తనకు గల గుణ సామ్యాన్ని గుర్తిస్తాడు. ఈ విధంగా అతడు పూర్వ కర్మల ఫలాలన్నింటి నుంచి విముక్తుడవుతాడు." (భ.గీ.6.27)

సుఖం కోసం మనస్సు నిరంతరం అనేక విషయాలను కల్పించుకుంటూ ఉంటుంది. "ఇలా జరిగితే నాకు సుఖం లభిస్తుంది. అలా జరిగితే నాకు సుఖం లభిస్తుంది. దీనిలో సుఖం ఉంది, దానిలో సుఖం ఉంది" అని భ్రమిస్తూ ఉంటుంది. ఈ విధంగా మన మనస్సు మనలను అక్కడికీ ఇక్కడికీ తిప్పుతూ ఉంటుంది. కళ్ళాలు లేని గుఱ్ఱాలు లాగుతున్న రథం మీద పయనిస్తున్నట్లుంటుంది. మనకు మన గమ్య స్థానం పై ఏ విధమైన అధికారం ఉండదు. మహా భయంతో నిస్సహాయులమై ఊరకే రథంపై కూర్చుని చూస్తూ ఉండవలసి వస్తుంది. మన మనస్సు కృష్ణ చైతన్య మార్గంలో - ముఖ్యంగా "హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే / హరే రామ హరే రామ రామ రామ హరే హరే" అని కీర్తిస్తూ స్థిరత్వం పొందిన వెంటనే మన మనస్సును లాగుతున్న పొగరుబోతు గుఱ్ఱాలు క్రమక్రమంగా మన అదుపులోకి వస్తాయి. ఎదురు తిరిగి యథేచ్ఛగా వర్తిస్తూ అనిత్యమైన భౌతిక విషయం కోసం ఆరాటపడుతూ ఒక విషయం మీద నుంచి మరొక విషయం మీదకు కొనిపోతూ ఉన్న ఈ గుఱ్ఱాలు మన అదుపులో ఉండాలంటే మనం మన జీవితంలో ప్రతి క్షణం కృష్ణ సేవలోనే గడుపాలి.

యుంజ న్నేవం సదాత్మానం యోగీ విగత కల్మషః
సుఖేన బ్రహ్మ సంస్పర్శ మత్యంతం సుఖ మశ్నుతే

"ఈ విధంగా ఆత్మ నిగ్రహం గలయోగి అన్ని వేళలలో యోగాభ్యాసంలో నిమగ్నుడై సర్వ భౌతిక కాలుష్యాలనుంచి ముక్తుడవుతాడు. అతడు



భగవంతుని ప్రేమ యుక్తమైన దివ్య సేవలో సంపూర్ణ సౌఖ్యం అనుభవిస్తాడు." (భ.గీ.6.28)

తన భక్తుని పై కృష్ణుడు వాత్సల్యం కలిగి, అతనికి రక్షకుడుగా ఉంటాడు. ఎవరికైనా ఆపద వచ్చినప్పుడు అతని రక్షకుడు అతనిని రక్షిస్తాడు కదా! భగవద్గీతలో చెప్పినట్లు కృష్ణుడు సర్వ భూతాలకు నిజమైన మిత్రుడు. కాబట్టి మనం ఆయనతో సౌహార్దాన్ని తిరిగి నెలకొల్పుకోవాలి. ఆ సౌహార్దాన్ని పునరుజ్జీవింప చేసికొనే మార్గమే కృష్ణ చైతన్య మార్గం. కృష్ణ చైతన్యాభ్యాసం వలన భౌతిక భోగాల వైపు వెర్రిగా పరుగులు పెట్టడం ఆగిపోతుంది. తీవ్రమైన విషయ వాంఛలే కృష్ణుని నుంచి మనలను దూరం చేస్తున్నాయి. కృష్ణుడు మనలోనే ఉంటాడు. మనం తన వైపుకు మరలడం కోసం నిరీక్షిస్తూ ఉంటాడు. కాని విషయ వాంఛ అనే వృక్షం తాలూకు ఫలాలను తినాలనే ఆతురతలో మనం ఆ సంగతిని గుర్తించుకోడం లేదు. ఈ ఫలాలను తినాలనుకునే బలమైన వాంఛ అంతరించాలి, శుద్ధాత్మ అయిన బ్రహ్మంతో మనకు గల సామ్యాన్ని తిరిగి అనుభవించాలి.

# 2. నామ సంకీర్తన ద్వారా కృష్ణుని తెలుసుకోవచ్చు!

హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే
హరే రామ హరే రామ రామ రామ హరే హరే

ఇది దివ్యనాద ప్రకంపనం. ఇది మన మనసనే అద్దం మీద పడిన దుమ్మును తుడిచి వేస్తుంది. వాహనాల అత్యధికమైన రాకపోకల వలన న్యూయార్క్ మహా నగరం రెండవ ఎవెన్యూలోని ప్రతి వస్తువు మీద దుమ్ము దట్టంగా పేరుకుని ఉన్నట్లు [అప్పుడు శ్రీల ప్రభుపాదుల వారు అక్కడే బోధిస్తున్నారు] ఇప్పుడు మన మనస్సులనే స్వచ్ఛమైన అద్దాల మీద భౌతిక విషయాసక్తి అనే దుమ్ము, మసి బాగా దట్టంగా పేరుకుని ఉంది. అందుచేతనే మనం వస్తువుల నిజమైన స్వరూపాన్ని తెలిసికోలేకపోతున్నాము. ఈ దివ్యనాద ప్రకంపనం ('హరే కృష్ణ' మహామంత్రం) ఆ దుమ్మును, మసిని తుడిచి వేసి మనం మన వాస్తవ స్వరూపాన్ని స్పష్టంగా గుర్తించేటట్లు చేస్తుంది. "నేను ఈ శరీరం కాదు. నేను జీవాత్మను. నా లక్షణం చైతన్యం" అని మనకు తెలిసిన వెంటనే మనం నిజమైన ఆనందంలో స్థిరపడుతాము. ఈ 'హరే కృష్ణ' సంకీర్తనం చేత మన బుద్ధి విశుద్ధమౌతుంది. మన భౌతిక దుఃఖాలన్నీ మటు మాయమైపోతాయి. భౌతిక విశ్వంలో నిరంతరం మండుతూ ఉండే దుఃఖాగ్ని ఒకటి ఉంది. ప్రతి వాడు దానిని ఆర్పివేయడానికి ప్రయత్నిస్తున్నాడు. కాని భౌతిక స్వభావం గల ఈ దుఃఖాగ్నిని చల్లార్చడం ఆధ్యాత్మిక జీవితంలో సుప్రతిష్ఠితులం కాకపోతే సాధ్యం కాదు.

సర్వ ప్రాణుల భౌతిక జీవన దుఃఖాగ్నిని చల్లార్చడం శ్రీకృష్ణావతార ప్రయోజనాలలో ఒకటి.



యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజా మ్యహమ్
పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే

"ఓ భరత వంశీయుడా! ఎప్పుడు, ఎక్కడ మతాచారం క్షీణదశకు వచ్చి అధర్మం అభివృద్ధి చెందుతుందో అప్పుడు, అక్కడ నేను అవతరిస్తూ ఉంటాను. సజ్జనులను సంరక్షించడానికీ, దుర్మార్గులను నశింపచేయడానికీ, ధర్మాన్ని తిరిగి స్థాపించడానికి ప్రతి యుగంలోనూ నేను అవతరిస్తూ ఉంటాను." (భ.గీ.4.7,8)

ఈ శ్లోకాలలో 'ధర్మం' అనే పదం ప్రయోగించబడింది. ఈ మాటను ఆంగ్లభాషలోకి అనువదించినప్పుడు అనేక విధాల మాటలు వాడారు. ఒక్కొక్కసారి దానిని 'ఫెయిత్' అన్నారు. అంటే మత విశ్వాసం అని అర్థం. కాని వైదిక సాహిత్యాన్ని బట్టి చూస్తే 'ధర్మము' అంటే ఎలాంటి మత విశ్వాసమూ కాదు. మతం మారవచ్చును కాని ధర్మం మారదు. ఉదాహరణకు నీరు గడ్డ కట్టుకుని పోయిందనుకుందాం. దాని ధర్మం మారిందన్న మాట.అది తన ద్రవ స్వభావాన్ని పోగొట్టుకుందన్న మాట. అది ఒక ప్రత్యేక స్థితిని పొంది ఆ దశలో ఉంది. మన ధర్మము లేక స్వరూప స్థితి ఏమిటంటే పరబ్రహ్మలో ఒక అంశంగా ఉండడం. అలా ఉండాలంటే మనం మన చైతన్యాన్ని దేవదేవుని వశం చేయాలి!

పరబ్రహ్మ పట్ల ఉండవలసిన దివ్య సేవాభావం విషయ రక్తి వలన దుర్వినియోగం అవుతూంది. నిజానికి సేవాభావం మన మూల స్వరూపంలోనే ఉంది. ప్రతి వాడు సేవకుడే! ఎవరూ స్వామి కాదు. ప్రతి ఒక్కరూ ఎవరినో ఒకరిని సేవిస్తూనే ఉన్నారు. దేశాధ్యక్షుడు దేశంలోని కార్యకర్తలకందరికీ

నాయకుడైనా తాను కూడా దేశ సేవకుడే! అతని సేవల అవసరం ఇక లేదని భావించినప్పుడు దేశం అతనిని తొలగిస్తుంది. "నేను చూస్తున్న సమస్తానికీ నేను ప్రభువును" అనుకోవడమే భ్రమ లేక 'మాయ'. ఈ విధంగా భౌతిక జీవనాసక్తి కారణంగా మన సేవాభావం అనేక ఉపాధుల రూపాలతో దురుపయోగం అవుతూంది. ఈ ఉపాధుల నుంచి మనం విముక్తులమైనప్పుడు, అంటే మన మనో దర్పణాల మీద ధూళి తొలగి పోయినప్పుడు మనం కృష్ణ భగవానుని నిత్య సేవకులం అనే మన నిజస్థితిని తెలిసికోగలుగుతాము.

భౌతిక ప్రపంచంలో చేసే సేవ, ఆధ్యాత్మిక వాతావరణంలో చేసే సేవ- రెండూ ఒకలాంటివే అని ఎవరూ భావించరాదు. "మోక్షం వచ్చిన తరువాత కూడా నేను సేవకునిలాగే ఉంటానా?" అని మనం నిరుత్సాహపడ వచ్చును. అలా నిరుత్సాహపడడానికి కారణం భౌతిక జగత్తులో మనం చేసే సేవ ఏమంత సుఖదాయకం కాకపోవడమే! అయితే భగవత్ సేవ అలాంటిది కాదు. ఆధ్యాత్మిక లోకంలో స్వామి, భృత్యుడు అనే భేదం ఉండదు. ఈ ప్రపంచంలో అయితే అటువంటి భేదభావం ఉంటుంది. కాని ఆధ్యాత్మిక ప్రపంచం ద్వంద్వాలకు అతీతమైంది. ఉదాహరణకు భగవద్గీతలో కృష్ణుడు అర్జునునకు రథసారధి అయి, సేవకుని స్థానంలో ఉండడం మనం చూస్తాము. వాస్తవానికి అర్జునుడే సహజంగా కృష్ణుని సేవకుడు. కాని కొన్నిసార్లు భగవంతుడే తన సేవకులకు సేవకుడు కావడం మనం చూస్తూ ఉంటాము. కాబట్టి భౌతిక భావాలను ఆధ్యాత్మిక సామ్రాజ్యానికి అన్వయించకుండా మనం జాగ్రత్త పడాలి. భౌతిక ప్రపంచంలో మనం అనుభవించే ప్రతి విషయమూ ఆధ్యాత్మిక జీవితంలోని విషయాలకు వికృత ప్రతిబింబమే.



మన సహజ స్థితి భ్రష్టమైనప్పుడు, అంటే ధర్మం భౌతిక జగత్తు సంపర్కం వలన కలుషితమైనప్పుడు దేవదేవుడు స్వయంగా భూమి మీద అవతరిస్తాడు. లేకపోతే తన అంతరంగిక పరివారంలో ఎవరినైనా పంపుతాడు. యేసుక్రీస్తు తాను 'దేవుని కుమారుడను' అని ప్రకటించుకున్నాడు. కాబట్టి అతడు దేవాదిదేవుని ప్రతినిధి అని మనం గ్రహించాలి. అలాగే మహమ్మదు తనను దేవాదిదేవుని సేవకుడిగా ప్రతినిధిగా చెప్పుకున్నాడు. మన సహజ స్థితిలో కల్లోలం ఏర్పడినపుడెల్ల దేవాదిదేవుడు స్వయంగానైనా అవతరిస్తాడు. లేదా జీవాత్మల యథార్థస్థితిని తిరిగి గుర్తుచేయడానికి తన ప్రతినిధినైనా పంపిస్తాడు.

కాబట్టి 'ధర్మం' ఎవరి చేతనో నిర్మించబడిన ఒక మత విశ్వాసం అని ఎవరూ పొరపాటు పడకూడదు. 'ధర్మం' అనే మాట అర్థాన్ని బట్టి చూస్తే ధర్మాన్ని జీవాత్మ నుంచి ఎప్పుడూ వేరుచేయలేము. ధర్మం జీవాత్మ సహజ గుణం. పంచదారకు తీపిరుచి, ఉప్పుకు ఉప్పదనం, రాతికి గట్టిదనం ఎలాగో జీవుడికి ధర్మం అలాంటిది. ఎలాంటి పరిస్థితులలోను దానిని విడదీయడం అసంభవం. జీవాత్మ సహజ ధర్మం సేవించడమే! ప్రతిప్రాణికీ తనకో మరొకరికో సేవచేసే బుద్ధి ఉంటుందని మనం సులభంగా గ్రహించగలము. కృష్ణుణ్ణి సేవించడం ఎలాగో, భౌతిక సేవల నుంచి తప్పించుకోడం ఎలాగో, లౌకిక అహంకారాల నుంచి బయట పడడం ఎలాగో అంతా భగవద్గీతలో కృష్ణుడు అర్జునునికి ఒక శాస్త్రంలాగ ఉపదేశించాడు.

పైన పేర్కొన్న 'పరిత్రాణాయ సాధూనాం' అనే శ్లోకంలో 'సాధు' అనే పదానికి పావన చరిత్ర కల సత్పురుషుడని అర్థం. సత్పురుషుడు క్షమాగుణం కలవాడై అందరి పట్ల దయ కలిగి, సర్వప్రాణుల యెడల స్నేహభావం ప్రకటిస్తాడు. ఎవ్వరికీ శత్రువు కాడు. సదా శాంతచిత్తుడుగా ఉంటాడు. పుణ్యపురుషునికి రెండు మంచి గుణాలుంటాయి (చైతన్య

చరితామృత, మధ్యలీల 22.78-80). శ్రీకృష్ణుడు భగవద్గీత (9.30) లో స్వయంగా ఇలా బోధించాడు:

అపి చే త్సుదురాచారో భజతే మా మనన్యభాక్
సాధు రేవ స మంతవ్య: సమ్య గ్వ్యవసితో హి స:

"ఎక్కువ చెడ్డ పనులు చేసేవాడు కూడా ప్రేమయుక్తమైన భగవత్ సేవలో నిమగ్నుడై ఉంటే అతనిని సాధువు (సజ్జనుడు) గానే యోగిగానే పరిగణించాలి."

భౌతిక ప్రపంచంలో ఒకరికి నీతి మరి ఒకరికి అవినీతి కావచ్చును. హిందువుల దృష్టిలో మద్యపానం నిషిద్ధం. కాని పాశ్చాత్య ప్రపంచంలో అది సర్వ సామాన్యం. కాబట్టి 'నీతి' దేశ, కాల, సాంఘికాది పరిస్థితులను బట్టి ఉంటుంది. అయితే ప్రతి మానవ సంఘంలోను 'నీతి', 'అవినీతి' అనే విచక్షణ ఉంది. కనుకనే ఈ శ్లోకంలో ఒకవేళ ఎవరైనా దురాచారపరుడై ఉంటే కూడా అతడు కృష్ణ చైతన్యంలో నిమగ్నుడై ఉంటే అతనిని పవిత్రుడు గానే పరిగణించాలని కృష్ణుడు ప్రత్యేకంగా పేర్కొన్నాడు. అంటే ఒక మనిషి పూర్వ సంబంధం వలన దురాచారుడైనప్పటికీ, అతడు కృష్ణ చైతన్యంలో పూర్తిగా నిమగ్నుడైతే ఆ దురాచారాలను లెక్కలోకి తీసుకోకూడదు. ఎవరైనా కృష్ణ చైతన్యమార్గం అవలంబిస్తే క్రమక్రమంగా అతడు పవిత్రుడై సత్పురుషుడు కాగలడు. కృష్ణ చైతన్యాన్ని అలవరచుకున్న కొలది అతని దురాచారాలు సన్నగిల్లి,సంపూర్ణంగా సత్పురుషుడు కాగలడు.

ఈ సందర్భంలో దొంగను గూర్చి ఒక కథ ప్రచారంలో ఉంది. ఆ దొంగ ఒక పుణ్య క్షేత్రానికి వెళ్ళాడు. త్రోవలో విశ్రాంతి కోసం ఒక సత్రంలో బస చేశాడు. దొంగతనానికి అలవాటు పడ్డ అతనికి ఇతర యాత్రీకుల వస్తువులను దొంగిలించాలనిపించి అందుకు ఉపాయం ఆలోచిస్తున్నాడు. కాని "నేను పుణ్యక్షేత్ర యాత్రకు బయలు దేరాను కదా! కాబట్టి వీరి



వస్తువులను దొంగిలించడం మంచిది కాదు. ఆ పని చేయను" అని అనుకున్నాడు. అయితే అలవాటు ప్రకారం వారి సామానుల నుంచి చేతులు వెనుకకు తీసికోలేక చాలా బాధపడి, చివరకు ఒక యాత్రికుని మూట తీసి మరొక చోట దాచి, వేరొక యాత్రికుని సంచి తీసి మరొక చోట దాచి, అలా మూటల స్థలాలను మారుస్తూ రాత్రి అంతా గడిపాడు. అంతరాత్మ ప్రబోధం వలన వారి సామానులను దొంగిలించలేదు. మరునాటి ఉదయాన్నే యాత్రీకులు నిద్రలేచి తమ తమ మూటల కోసం అన్ని పక్కలా వెదికారు. కాని అవి కనిపించలేదు. చాలా కంగారు పడ్డారు. అఖరుకు తమ తమ మూటలు వేరు వేరు స్థలాలలో ఉండడం గమనించారు. అప్పుడా దొంగ వారితో ఇలా అన్నాడు: "అయ్యలారా! నా వృత్తి దొంగతనం. రాత్రిపూట దొంగతనం చేయడం నా అలవాటు. అందుచేత మీ మూటల నుంచి ఏమైనా దొంగిలించాలను కున్నాను. కాని నేను పుణ్యక్షేత్ర దర్శనానికి వచ్చాను గనుక దొంగిలించ లేకపోయాను. మూటలను అక్కడివి ఇక్కడ, ఇక్కడవి అక్కడ పెట్టి సంతృప్తి చెందాను. దయచేసి నన్ను క్షమించండి." దురభ్యాస లక్షణం అలా ఉంటుంది. ఆ తరువాత కూడా అతనికి దొంగతనం చేయడం ఇష్టం లేదు కాని అలవాటు మానుకోలేక అప్పుడప్పుడు చేస్తుండేవాడు. తుదకు కృష్ణ చైతన్యం పొందాక అతడు ఆ వృత్తిని పూర్తిగా మానివేశాడు. కాబట్టి దురాచారాల నుంచి విరమించుకొని కృష్ణ చైతన్యంలో క్రమంగా స్థిరపడుతూ అప్పుడప్పుడు అనుకోకుండా వెనుకటి దురభ్యాసానికి లోబడి పోయినా, అతనిని మనం సాధువుగానే (అంటే సత్పురుషుడుగానే) పరిగణించాలని కృష్ణుడంటున్నాడు. ఆ తరువాత శ్లోకంలో (9.31) కృష్ణుడిలా ఉపదేశిస్తున్నాడు:

క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వ చ్ఛాంతిం నిగచ్ఛతి
కౌంతేయ! ప్రతిజానీహి న మే భక్త: ప్రణశ్యతి

"ఓ! కౌంతేయా, అతడు వెంటనే ధర్మాత్ముడై శాశ్వతమైన శాంతిని పొందుతాడు. నా భక్తుడు ఎప్పుడు నశించడని ధైర్యంగా చాటి చెప్పు."

కృష్ణ చైతన్య మార్గాన్ని స్వీకరించినవాడు చాలా తక్కువ కాలంలోనే సత్పురుషుడు అవుతాడని శ్రీకృష్ణుడు ప్రకటించాడు.విద్యుత్ పంఖా ప్లగ్‌ను ఊడదీసిన తరువాత కూడా మరికొంత సేపు తిరిగి ఆగిపోతుందని అందరికీ తెలుసును. అలాగే శ్రీకృష్ణుని పాదపద్మాలను ఆశ్రయించిన తరువాత కర్మ పరంపరలను కొనసాగించే ప్లగ్‌ను ఊడదీస్తాము. అయినా కూడా ఈ కర్మలు కొంతకాలం కొనసాగి, తరువాత అతిశీఘ్రంగానే అవి నిలిచి పోతాయి. నిజానికి కృష్ణ చైతన్యాన్ని ఆశ్రయించిన వాడు సత్పురుషుడు కావడానికి వేరే ప్రయత్నం చేయనక్కర లేదు. సద్గుణాలన్నీ స్వయంగానే వచ్చి అతనిని చేరుతాయి. కృష్ణ చైతన్య మార్గంలో అడుగిడిన వెంటనే ఎవరైనా సర్వ సద్గుణాలు పొందగలవారని శ్రీమద్భాగవతం (5.18.12) లో కృష్ణుడు అభయం ఇచ్చాడు. భగవద్భావన లేకుండ ఎన్ని సద్గుణాలున్నా అవి అన్నీ నిరుపయోగాలే అని కూడా తెలిసికోవాలి. కృష్ణ చైతన్యం తప్ప మరేది మానవుణ్ణి అవాంఛనీయ కర్మాచరణం నుంచి తప్పించజాలదు. కృష్ణ చైతన్య రహితుడు ఈ ఐహిక జగత్తులో తప్పులు చేస్తూనే ఉంటాడు.

జన్మ కర్మ చ మే దివ్యం ఏవం యో వేత్తి తత్త్వత:
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మా మేతి సోఽర్జున!

"ఓ అర్జునా! నా పుట్టుక, నా లీలలు దివ్యములైనవని తెలిసికొన్న వాడే శరీరం త్యజించిన తరువాత (మరణానంతరం) తిరిగి ఇహ లోకంలో జన్మించకుండా నా సన్నిధి చేరుకుంటాడు." (భ.గీ. 4.9)

కృష్ణుని అవతార ప్రయోజనాన్ని గురించి ఇక్కడ మరికొంత వివరించాలి. ఒక ప్రయోజనం కోసం అవతరించినప్పుడు కొన్ని పనులు చేయాలి. కొందరు తాత్త్వికులు భగవంతుడు అవతరిస్తాడంటే నమ్మరు. "పాడైపోయిన ఈ ప్రపంచంలోకి భగవంతుడు ఎందుకు రావాలి" అంటారు. కాని, భగవద్గీత భగవంతుడు అవతరిస్తాడని చెబుతుంది. భగవద్గీతలో ప్రవచించ బడిందంతా ప్రామాణికమని మనం మరచిపోరాదు. అలా కాక పోతే దానిని చదువవలసిన అవసరమే లేదు. తాను ఒక ప్రయోజనం కోసం జన్మించినట్లు, దానికి అనుగుణంగా కొన్ని కర్మలు చేసినట్లు శ్రీకృష్ణుడు ప్రకటించాడు. కృష్ణుడు అర్జునుని రథసారథిగా ఉండి, కురుక్షేత్ర యుద్ధంలో అనేక కార్యాలు చేసిన సంగతి మనకు తెలుసు. యుద్ధంలో ఒక వ్యక్తి లేదా జాతి ఏదో ఒక పక్షంలో చేరవచ్చును; పక్షపాతం వహించవచ్చును. శ్రీకృష్ణుడు రణరంగంలో అర్జునుని పక్షం వహించాడు. అతని పట్ల పక్షపాతం చూపించాడు. అయితే కృష్ణుడు పైకి మాత్రమే పక్షపాతం కలవానిలా కనిపిస్తాడు. ఆ పక్షపాతాన్ని ఏదో సామాన్యమైన పక్షపాతంలాగ భావించరాదు.



ఈ భూలోకంలో తాను అవతరించడం దివ్య విషయం అని కృష్ణుడు ఈ శ్లోకంలో ప్రత్యేకంగా తెలుపుతున్నాడు. ఇక్కడ 'దివ్యం' అనే మాటకు లోకాతీతమని అర్థం. కృష్ణుని కర్మలు ఏ విధంగానూ సామాన్యమైనవి కావు. క్రైస్తవులు క్రీస్తు జన్మదినాన్ని క్రిస్మసు పండుగగా జరుపుకుంటున్నట్లు ఈ నాటికీ భారత దేశంలో శ్రావణమాసంలో కృష్ణుని జన్మదినోత్సవాన్ని జరుపుకుంటున్నారు. కృష్ణుడు జన్మించిన దినాన్ని "జన్మాష్టమి" అంటారు. ఈ శ్లోకంలో 'జన్మ' అనే పదాన్ని కృష్ణుడు ప్రయోగించాడు. కృష్ణునికి కూడా జన్మ కర్మలు ఉన్నా ఆయన జన్మ కర్మలు దివ్యములైనవి. అంటే అవి సామాన్య మానవుల జన్మ కర్మల వంటివి కావని అర్థం. అవి ఎలా దివ్యములైనవి అని ఎవరైనా అడుగవచ్చును. ఆయన మానవుని లాగ జన్మించాడు. అర్జునుని పక్షాన యుద్ధంలో పాల్గొన్నాడు. అతనికి దేవకీ వసుదేవులనే తల్లిదండ్రులు ఉన్నారు. ఒక కుటుంబం ఉంది. అలాంటప్పుడు

అతని జన్మ కర్మలను దివ్యములని భావించడం ఎలా? దీనికి సమాధానంగా "ఏవం యో వేత్తి తత్త్వత:'' అని కృష్ణుడంటున్నాడు - కృష్ణుని జన్మ కర్మల తత్త్వాన్ని తెలిసికోవాలి! అప్పుడే వాటి దివ్యత్వం బోధపడుతుంది. అలా బోధపరచుకున్న వారికి గొప్ప ఫలితం సిద్ధిస్తుంది: "త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మా మేతి సోఽర్జున'' - వారు ఈ దేహాన్ని విడిచిన తరువాత మళ్ళీ జన్మించరు. కృష్ణుడిని చేరుకుంటారు. అంటే మోక్షం పొందుతారు అని అర్థం. శాశ్వతమైన ఆధ్యాత్మికలోకానికి చేరి ఆనందభరితమైన తమ స్వరూప స్థితిని తిరిగి పొందుతారు. ఈ భాగ్యం కృష్ణుని దివ్యమైన జన్మ కర్మలను గురించి తెలిసికోడం వలన ప్రాప్తిస్తుంది.

సాధారణంగా ఒక దేహాన్ని విడిచిన జీవుడు మరో దేహంలో ప్రవేశిస్తాడు. జీవాత్మలు దేహాలను మారుస్తూ ఉండడం వలననే జన్మలు కొనసాగుతున్నాయి. జీవుల కర్మలను బట్టి పునర్జన్మ ఏర్పడుతుంది. ఎప్పటి కప్పుడు ఈ భౌతిక (ప్రత్యక్ష స్థూల) దేహమే నిజమైన దేహం అనుకుంటున్నాము. కాని, ఇది ఒక ఉడుపు లాంటిది. యథార్థంగా మనకు మనదైన ఒక శరీరం ఉంది, అది ఆధ్యాత్మిక శరీరం. ప్రత్యక్షంగా కనిపించే ఈ స్థూల శరీరం పాతదై చినిగి పోయినప్పడు (అంటే ముసలిదై పనికి రాకుండా పోయినప్పుడు), లేదా ఆకస్మిక ప్రమాదం వలన పాడైపోయినప్పుడు, దానిని మాసిన, చినిగిన వస్త్రంలాగ విడిచివేసి, మరొక స్థూల శరీరాన్ని గ్రహిస్తాము.

వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోఽపరాణి
తథా శరీరాణి విహాయ జీర్ణా న్యన్యాని సంయాతి నవాని దేహీ

"మానవుడు తన చినిగిపోయిన వస్త్రాలను వదలి నూతన వస్త్రాలను ధరించినట్లే ఆత్మ నిష్ప్రయోజనమైన శరీరాలను వదిలి కొత్త శరీరాలను ధరిస్తుంది.'' (భ.గీ.2.22)



మొదట శరీరం ఒక సెనగగింజంత ఉంటుంది. తరువాత శిశువుగా పెరుగుతుంది. తరువాత బాలుడుగా, యువకుడుగా, ముసలివాడుగా మారి చివరకు అది పనికిరానప్పుడు దేహి (ఆత్మ) మరో దేహానికి మారుతాడు. కాబట్టి శరీరం సదా మారిపోతూనే ఉంటుంది. మరణం అనేది ఈ దేహం పొందే చివరి మార్పు.

దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా
తథా దేహాంతర ప్రాప్తి ర్ధీర స్తత్ర న ముహ్యతి

"ఈ శరీరంలోని ఆత్మ బాల్యం నుంచి యౌవనానికి, యౌవనం నుంచి వృద్ధాప్యానికీ ఎలా అవిచ్ఛిన్నంగా పయనిస్తుందో అలాగే మరణించే సమయంలో వేరొక శరీరంలోకి పయనిస్తుంది. ఆత్మ జ్ఞానం గల మానవుడు ఇలాంటి మార్పువలన కలవరపడడు.'' (భ.గీ. 2.13)

దేహం మారుతున్నప్పటికీ లోపల ఉన్నదే మాత్రం మారకుండా అలాగే ఉంటాడు. అంటే బాల్యంలో ఉన్న జీవాత్మ వెళ్ళిపోయిందని అర్థం కాదు. ప్రతిక్షణం శరీరం మారిపోతూంటుందని వైద్యశాస్త్రం చెబుతుంది. ఈ మార్పులకు ప్రాణులు ఎలా భయపడరో, అలాగే ఆత్మ జ్ఞానం కలవాడు మరణ సమయంలో ఏర్పడే చివరి మార్పుకు కూడా భయపడడు. కాని, విషయాలను ఉన్నవి ఉన్నట్లుగా అర్థం చేసుకోలేని వాడు శోకిస్తాడు. భౌతిక స్థితిలో శరీరాలను ఎప్పుడూ మార్చుకుంటూనే ఉంటాము. అదే మన వ్యాధి. అయితే మనం ప్రతిసారి మానవ శరీరాన్నే పొందుతామన్న నమ్మకం లేదు. ఒక పశు శరీరాన్ని పొందవచ్చును. లేదా దేవతా శరీరాన్ని పొందవచ్చును. అది మనం చేసే కర్మలను బట్టి ఉంటుంది. పద్మ పురాణం ప్రకారం 84 లక్షల రకాల జీవరాశులున్నాయి. మనకు వాటిలో ఏ జన్మ అయినా రావచ్చును. కాని తన దివ్య జన్మ కర్మల తత్త్వం తెలిసికొన్న వాడు సంసార చక్రబంధం నుంచి విముక్తుడవుతాడని కృష్ణుడు వాగ్దానం చేస్తున్నాడు.

కృష్ణుని దివ్య జన్మ కర్మలను గురించి తత్త్వతః తెలిసికోడం ఎలాగ? అది భగవద్గీతలోని 18వ అధ్యాయంలో ఇలా వివరించబడింది:

భక్త్యా మా మభిజానాతి యావాన్ య శ్చాస్మి తత్త్వతః
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే త దనంతరమ్

"మానవుడు భక్తి యుక్త సేవ చేత దేవాదిదేవుడనైన నన్ను యథా తథంగా అర్థం చేసికోగలడు. అలాంటి భక్తి చేత అతడు నన్ను పూర్తిగా తెలిసికొన్నప్పుడు భగవద్ రాజ్యంలో ప్రవేశించ గలడు." (భ.గీ.18.55)

మళ్ళీ ఇక్కడ కూడా 'తత్త్వతః' (వాస్తవంగా) అని ప్రయోగించబడింది. భక్తుడైన తరువాతనే ఎవరికైనా కృష్ణ విజ్ఞానం యథాతథంగా ప్రాప్తిస్తుంది. భక్తుడు కానివాడు, కృష్ణ చైతన్యం కోసం ప్రయత్నించని వాడు ఆ విజ్ఞానం పొందలేడు. భగవద్గీత 4 అధ్యాయం ప్రారంభంలో కూడా "అర్జునుడు తన భక్తుడనీ, సఖుడనీ," అతనికి సనాతనమైన యోగ శాస్త్రాన్ని బోధిస్తున్నానని శ్రీకృష్ణుడు అన్నాడు(భ.గీ. 4.3). ఎందుచేతనంటే కేవలం కాలక్షేపం కోసం భగవద్గీతను చదివే వారికి కృష్ణ తత్త్వం అజ్ఞాతం గానే ఉండిపోతుంది. భగవద్గీత డబ్బిచ్చి దుకాణంలో కొని, కేవలం పాండిత్యంతో అర్థం చేసికోగలిగిన పుస్తకం కాదు. నిజానికి - అర్జునుడు పెద్ద పండితుడు కాడు; వేదాంతీ కాడు; తత్త్వ చింతకుడూ కాదు, బ్రాహ్మణుడూ కాడు; సన్యాసీకాడు, అతడు గృహస్థు, మహా యోధుడు. అయినా కృష్ణుడు అర్జునుణ్ణి తన శిష్యపరంపరలో ప్రథముడుగా గీతోపదేశం వినడానికి అధికారిగా ఎన్నుకున్నాడు. ఎందుచేత? ఎందుచేతనంటే: "నీవు నాభక్తుడివి కాబట్టి" అన్నాడు. భగవద్గీతను నిజంగా అర్థం చేసుకోవాలంటే అలాంటి యోగ్యత ఉండాలి. అంటే కృష్ణ చైతన్యం కలవాడై ఉండాలి.



అయితే కృష్ణ చైతన్యం అంటే ఏమిటి? అది "హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే / హరే రామ హరే రామ రామ రామ హరే హరే" అని జపించడం ద్వారా మనస్సు అనే అద్దం నుంచి ధూళిని తుడిచివేసే కార్యక్రమం. ఈ మంత్రం జపించడం ద్వారా, భగవద్గీతను శ్రవణం చేయడం ద్వారా మనం క్రమంగా కృష్ణ చైతన్యాన్ని పొందగలుగుతాము. "ఈశ్వర స్సర్వభూతానామ్" - కృష్ణుడు నిరంతరం మన హృదయం లోపలే ఉంటాడు. జీవాత్మ, పరమాత్మ ఈ శరీరమనే వృక్షం మీద కూర్చుని ఉన్నారు. జీవుడు ఆ వృక్షం తాలూకు ఫలాలను తింటూ ఉంటాడు. పరమాత్మ ఊరక చూస్తూ ఉంటాడు. సాక్షి భూతుడుగా ఉంటాడు. జీవాత్మ భక్తియుక్త సేవాకార్యక్రమం ప్రారంభించి, క్రమంగా కృష్ణ చైతన్యాన్ని వృద్ధి చేసికోడం ప్రారంభించగానే అంతఃకరణం లోపల ఉన్న పరమాత్మ అతని మనసనే అద్దం పైన మాలిన్యాన్ని కడిగివేసికోడానికి సహాయం చేస్తాడు. సమస్త సత్పురుషులకు కృష్ణుడు స్నేహితుడు. కృష్ణ చైతన్యవంతుడు కావడానికి సత్పురుషులు ప్రయత్నిస్తారు. 'శ్రవణం, కీర్తనం' - (వినడం, గానం చేయడం) ద్వారా కృష్ణ విజ్ఞానాన్ని గ్రహించి, తద్వారా కృష్ణుని తెలిసికోడం జరుగుతుంది. అలా తెలిసికొన్నవారు మరణానంతరం ఆధ్యాత్మిక ప్రపంచంలోని దేవాదిదేవుని పరమపదం చేరుకుంటారు. ఆయన ఉండే పరమపదం భగవద్గీతలో ఇలా వర్ణించబడింది:

న త ద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః
య ద్గత్వా న నివర్తన్తే త ద్ధామ పరమం మమ

"ఆ నా దివ్యధామం సూర్యుని వలన గాని, చంద్రుని వలన గాని, అగ్ని వలన గాని, విద్యుత్తు వలన గాని ప్రకాశింపజేయబడదు. దానిని చేరేవారు మళ్ళీ ఈ భౌతిక జగత్తుకు తిరిగి రారు." (భ.గీ. 15.6)

ఈ భౌతిక జగత్తు ఎప్పుడూ తమోవృతమై ఉంటుంది. కాబట్టి దానికి వెలుతురును ఇవ్వడానికి సూర్యుడు, చంద్రుడు, అగ్ని కావాలి. ఈ చీకటిలో ఉండవద్దనీ, జ్యోతిలోకి, ఆధ్యాత్మిక లోకంలోకి రావాలనీ వేదాలు మనలను శాసిస్తున్నాయి. ఇక్కడ 'చీకటి' అనే మాటకు రెండు అర్థాలున్నాయి. వెలుతురు లేక పోవడం అనే అర్థం కాక, అజ్ఞానం అనే అర్థం కూడా ఉంది.

దేవాదిదేవుని శక్తులు అనంతమైనవి. దేవాదిదేవుడు ఈ ప్రపంచానికి దిగి రావడం కర్మలు చేయడం కోసమే అని అర్థం కాదు. నిజానికి దేవాదిదేవుడికి కర్తవ్యమే లేదని వేదాలే చెబుతున్నాయి. భగవద్గీత (3.22)లో కృష్ణుడు కూడా ఇలా అన్నాడు:

న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన
నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి

"ఓ కుంతీపుత్రా! నాకు మూడు లోకాలలోనూ నియమితమైన కర్తవ్యం అంటూ ఏదీలేదు. నాకు ఏదీ అక్కడ లేదు. నేను కోరవలసింది కూడా ఏదీ లేదు. అయినా నేను ఎల్లప్పుడూ కర్మలో నిమగ్నుడనై ఉంటాను."

కాబట్టి, ఈ భౌతిక ప్రపంచంలోకి దిగివచ్చి ఈ కర్మలనన్నింటినీ ఆచరించవలసిన అవసరం కృష్ణునికి ఉందని మనం భావించరాదు. కృష్ణునికి సమానుడు గాని, కృష్ణుని కంటె అధికుడు గాని ఎవరూ లేరు. కృష్ణుడు సర్వజ్ఞుడు. జ్ఞానం కోసం తపస్సులు చేయవలసిరావడం గాని, జ్ఞానాన్ని ఆర్జించవలసిన అవసరం గాని, ఆయనకు లేవు. సర్వకాల సర్వావస్థలలోను ఆయన జ్ఞాన ప్రపూర్ణుడే! కృష్ణుడు అర్జునునికి భగవద్గీతను ఉపదేశించి ఉండవచ్చు. కాని కృష్ణునికి ఎవ్వరూ ఎప్పుడూ భగవద్గీతను ఉపదేశించలేదు. అదీ కృష్ణుని స్వరూపం అని తెలిసిన వాడికి మళ్ళీ ఈ సంసార చక్రంలో పడిపోవలసిన అవసరం రాదు. మాయ ప్రభవానికి లొంగిపోయి ఈ భౌతిక



వాతావరణానికి అనుకూలంగా మారిపోతూ మన జీవితాలను వ్యర్థం చేస్తున్నాము, నిజానికి మానవ జీవితం ప్రయోజనం అది కాదు. శ్రీకృష్ణ తత్త్వాన్ని గ్రహించడమే మానవ జీవిత ధ్యేయం!

మన భౌతిక జీవితావసరాలు: ఆహారం, మైథునం, నిద్ర, ఆత్మ రక్షణ, ఇంద్రియ వాంఛలను సంతృప్తి పరచుకోడం, ఇవి పశువులకు మనుష్యులకు సమానమే! పశువులు ఈ సమస్యలను పరిష్కరించుకోడంలోనే నిమగ్నమై ఉంటాయి. మరి మనం కూడా ఆ సమస్యల పరిష్కార ప్రయత్నంలోనే గడపితే మృగాలకూ మనకూ భేదం ఏముంటుంది? మనిషికి ఒక విశిష్ట గుణం ఉంది. దాని ద్వారా అతడు దివ్యమైన కృష్ణ చైతన్యాన్ని సంపాదించగలడు. దానిని సరిగా వినియోగించు కోకపోతే పశువులలో అతడూ ఒక పశువైపోతాడు. బ్రతుకుతెరువుల సమస్యల పరిష్కారానికి ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వడం ఆధునిక నాగరకతలోని ప్రధాన దోషం. ఆస్తిక చింతన కల జీవులం కనుక జనన మరణ రూపమైన సంసార చక్రం నుంచి బయట పడడం మన కర్తవ్యం. మానవ జన్మలో మనకు లభించిన ప్రత్యేక అవకాశాలను పోగొట్టుకోకుండా మనం జాగ్రత్త పడాలి. శ్రీకృష్ణుడే స్వయంగా భగవద్గీతను ఉపదేశించడానికి వచ్చి మనం భగవచ్చైతన్యం పొందడానికి సహాయం చేస్తాడు. నిజానికి మానవ శరీరం జ్ఞానాభివృద్ధి ప్రయత్నాల కోసం ఉద్దేశింపబడింది. మానవ జన్మ వరాన్ని పొంది, దానిని కృష్ణ చైతన్యాభివృద్ధికి ఉపయోగించుకోకపోతే అపురూపంగా లభించిన అవకాశాన్ని మనం జారవిడుచుకొంటున్నామని అర్థం. కృష్ణ చైతన్య ప్రాప్తి ప్రక్రియ చాలా సులభమైనది: 'శ్రవణం', 'కీర్తనం' (వినడం, పాడడం). వినడం కంటె వేరే మనం ఏమీ చేయనవసరం లేదు. శ్రద్ధగా వింటే జ్ఞానాభివృద్ధి తప్పక కలుగుతుంది. కృష్ణుడు మన హృదయంలోనే ఉంటాడు కాబట్టి తప్పక సహాయం చేస్తాడు. మనం కొంచెం సమయం వెచ్చించి, కాస్త శ్రమ పడితే

చాలును! ఇందులో అభివృద్ధిని సాధించామా లేదా అని మనం ఎవరినీ అడుగ వలసిన పనిలేదు. ఆకలివేసిన వాడు కడుపునిండా తిన్నాక తృప్తి కలిగిందో లేదో స్వయంగానే తెలిసినట్లు మనకే తెలిసిపోతుంది.

నిజానికి ఈ కృష్ణ చైతన్య ప్రాప్తి లేక ఆత్మ సాక్షాత్కారం కష్ట సాధ్యం కాదు. దానిని కృష్ణుడు భగవద్గీతలో అర్జునునికి బోధించాడు. మనం కూడా అర్జునుని లాగ భగవద్గీతను అర్థం చేసికొంటే పరిపూర్ణ స్థితిని చేరుకోడం ఒక సమస్య కాదు. అయితే భగవద్గీతను మనం లౌకిక విద్యా మనస్తత్త్వంతో వ్యాఖ్యానించా లనుకుంటే దాని అర్థాన్ని పూర్తిగా చెడగొట్టిన వారం అవుతాము.

ఇంతకు ముందు చెప్పినట్టు జపాన్ని సాధన చేయడం ద్వారా భౌతిక ప్రపంచ సంపర్కం వలన మన మనసనే అద్దానికి అంటిన కాలుష్యాలన్నిటినీ తొలగించుకో గలము. కృష్ణ చైతన్యాన్ని పునరుద్ధరించుకోడానికి బాహ్య సహాయం అవసరం లేదు. ఎందుచేతనంటే కృష్ణ చైతన్యం మన ఆత్మలలోనే నిక్షిప్తమై ఉంది. నిజం చెప్పాలంటే కృష్ణ చైతన్యం ఆత్మకు సహజ లక్షణం. సాధన ద్వారా దానిని జాగృతం చేస్తున్నాము. కృష్ణ చైతన్యం నిత్యసత్యం. అది ఏదో ఒక ప్రత్యేక సంస్థ చేత ప్రతిపాదించిబడిన సిద్ధాంతం కాని, నమ్మకం కాని కాదు. అది జీవులందరిలో సహజంగా ఉంది. మనుష్యులలోను పశువులలోను కూడా! చైతన్య మహాప్రభువు దక్షిణ భారత దేశపు అరణ్యాలలో సుమారు 500 సంవత్సరాల క్రితం ప్రయాణం చేసినప్పుడు 'హరే కృష్ణ' సంకీర్తనం చేస్తే పులులు, ఏనుగులు, లేళ్ళు మొదలైన అన్ని జంతువులూ ఆ సంకీర్తనానికి అనుగుణంగా నాట్యం చేయడం ప్రారంభించాయట. అయితే అది వేర్వేరు భక్తుల సంకీర్తనంలోని పవిత్రతపై కూడా ఆధారపడిఉంటుంది. సంకీర్తనంలోని సాధనాబలం పెరిగిన కొద్దీ దానిలో పావనత్వం ఎక్కువగా చోటు చేసుకుంటుంది.

# 3. సర్వత్ర సర్వదా కృష్ణుని దర్శించడం ఎలా?

మన దైనందిన జీవితంలో కూడా కృష్ణ చైతన్యాన్ని ఎలా జాగృతం చేసుకోవాలో కృష్ణుడు మనకు ఉపదేశించాడు. దాని కోసం మన విధి నిర్వహణం మాననక్కరలేదు. కర్మలకు స్వస్తి చెప్పనక్కరలేదు. మరి ఎలాగ? మనం అన్ని పనులను కృష్ణ చైతన్యంతో నిర్వహించడం అలవరచుకోవాలి. ప్రతివ్యక్తికి జీవితంలో ఏదో ఒక వృత్తి ఉంటుంది. అయితే అతడు ఏ భావంతో ఆ వృత్తిలో ప్రవేశిస్తున్నాడు? "ఆహా! నా కుటుంబాన్ని పోషించుకోడానికి నాకేదైనా వృత్తి కావాలి కదా" అని ప్రతివాడు అనుకుంటాడు. అతడు సంఘాన్నో ప్రభుత్వాన్నో, కుటుంబాన్నో తృప్తి పరచవలసి ఉంది. అలాంటి భావం లేని వాడెవడూ ఉండడు. ఏ పనినైనా సక్రమంగా నిర్వహించాలంటే అందుకు సరియైన అవగాహన ఉండాలి. ఎవని బుద్ధి ఎప్పుడూ క్షోభిస్తూ ఉంటుందో వాడు పిచ్చివాడిలాగ ప్రవర్తిస్తాడే గాని ఏ పనినీ సరిగా చేయలేడు. మన విధిని మనం సరిగా నిర్వహించాలి; అయితే కృష్ణుని తృప్తిపరచడానికే ఏ పనినైనా మనం చేయాలి. మన పనులను మార్చుకోవలసిన పనిలేదు. ఎవరి కోసం ఆ పనులను చేస్తున్నామో అది మాత్రం తెలుసుకోవాలి. మనం చేయవలసింది చేస్తూనే ఉండాలి గాని, 'కామా' నికి లొంగిపో కూడదు. కామం అంటే కోరిక. కామం అనే సంస్కృత పదానికి స్త్రీ సంభోగ వాంఛ, విషయ వాంఛ అని అర్థం. కామ తృప్తి కోసం, విషయ సుఖం కోసం మనం పనిచేయకూడదని కృష్ణుడు ఆదేశించాడు. ఈ సిద్ధాంతం మీదనే భగవద్గీత చేసే ఉపదేశం అంతా ఆధారపడి ఉంది.

అర్జునుడు తన బంధువులతో యుద్ధం మానడం ద్వారా తన ఇంద్రియాలను సంతోషపెట్ట దలచాడు. కాని దేవాదిదేవుడైన తనను తృప్తి

పరచడం కోసం అర్జునుడు తన కర్తవ్యాన్ని నిర్వహించి తీరాలని అతనికి నచ్చజెప్పడానికి శ్రీకృష్ణుడు ప్రయత్నించాడు. తన బంధువర్గాన్ని చంపడానికి నిరాకరించడం, రాజ్యం మీద తన హక్కును వదలుకోడం లౌకిక దృష్టితో చూస్తే గొప్ప ధర్మాలుగా కనిపించవచ్చును. కాని, నిజానికి అర్జునుని యుద్ధ విరమణకు తన కోరికలను తృప్తి పరచుకోడమే ప్రధాన లక్ష్యం. కాబట్టి కృష్ణుడు దానిని అంగీకరించలేదు. ఎవరైనా తన పనిని గాని, వృత్తిని గాని మానుకో నవసరం లేదు. అర్జునుని విషయంలో కూడా అంతే. అయితే మన చైతన్యాన్ని మాత్రం మార్చుకోవలసి ఉంటుంది. అలాగ చైతన్యాన్ని మార్చుకోవాలంటే కృష్ణుని గూర్చిన జ్ఞానం అవసరం."నేను కృష్ణునిలోని అంశ భూతుణ్ణి, కృష్ణుని పరాశక్తిని" అని గ్రహించడమే ఆ జ్ఞానం. అదీ నిజమైన జ్ఞానం! సాపేక్ష జ్ఞానం ఒక యంత్రాన్ని బాగు చేయడం ఎలాగో మనకు నేర్పవచ్చు. కాని, నిజమైన జ్ఞానం: కృష్ణునిలో మనం అంశభూతులం అని గుర్తించడం. మనం కృష్ణుని అంశలము గనుక మన సుఖం కూడా అంశమాత్రంగానే ఉండి సంపూర్ణ సుఖం దేవాదిదేవుని మీదనే ఆధారపడి ఉంటుంది. ఉదాహరణకు : నా చేయి నా శరీరంలో భాగంగా ఉన్నప్పుడు నా శరీరానికి సేవ చేస్తేనే సుఖం అనుభవించగలదు. ఇతరుల శరీరాలను సేవించడంలో దానికి ఆనందంలేదు. అలాగే మనం కృష్ణునిలో భాగం (అంశ) కాబట్టి కృష్ణుని సేవించడంలోనే మానవ ఆనందం కలుగుతుంది. "నిన్ను సేవించడంలో నాకు సుఖం లేదు. నన్ను నేను సేవించుకోడంలోనే నాకు సుఖం ఉంది" అని ప్రతివాడూ అనుకుంటాడు. కాని ఆ 'నేను' అనేది ఏమిటో, ఎవరో ఎవరికీ స్పష్టంగా తెలియదు. ఆ 'నేను' శ్రీకృష్ణుడే!

మమైవాంశో జీవలోకే జీవభూతః సనాతనః
మనః షష్ఠానీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి



"ఈ బద్ధ జగత్తులోని జీవులందరూ నా శాశ్వత అంశలు. బద్ధ జీవితం కారణంగా మనస్సుతో కూడిన ఆరు ఇంద్రియాలతోను వారు సదమదమవుతున్నారు.'' (భ.గీ.15.7)

ఇప్పుడు ప్రకృతి సంపర్కం వలన జీవాత్మలు పరమాత్మ నుంచి విడిపోయి ఉన్నారు. కాబట్టి మనలోనే నిక్షిప్తమై ఉన్న కృష్ణ చైతన్యం ద్వారా మళ్ళీ కృష్ణుణ్ణి కలసికోవడానికి మనం గట్టి ప్రయత్నంచేయడం చాలా అవసరం. కృష్ణుణ్ని మరచిపోయి స్వతంత్రంగా జీవించడానికి మనం ప్రయత్నిస్తున్నాము. అయితే అది కృత్రిమము, ప్రకృతి విరుద్ధము కనుక అసంభం. కృష్ణునితో సంబంధం లేకుండా జీవించడానికి ప్రయత్నించినప్పుడు మనం ప్రకృతి నియమాల ప్రభావానికి లోనవుతాము. కృష్ణుని అధీనంలో లేననుకొన్నవాడు కృష్ణుని మాయాశక్తికి అధీనుడైపోతాడు. ఎలాగంటే ప్రభుత్వానికి, దాని చట్టాలకు లొంగని వాడు పోలీసు అధికారులకు లొంగిపోవలసి వస్తుంది. ప్రతివాడు స్వేచ్ఛగా ఉండాలనుకుంటాడు. అదే మాయ! వ్యక్తి పరంగా గాని, కుల పరంగా గాని సంఘ పరంగా గాని జాతి పరంగా గాని, ఏ విధంగా గాని మనిషికి స్వేచ్ఛ - అంటే దేనికీ కట్టుబడకుండా ఉండడం - అసంభం! 'మనం స్వతంత్రులము కాము' అని గ్రహించినప్పుడు మనకు నిజమైన జ్ఞానం కలిగిందన్నమాట. ఈనాడు చాలామంది ప్రపంచశాంతి కోసం పాటుపడుతున్నారు. అయితే ఆ శాంతి పథకాన్ని ఎలా అమలు పరచాలో మాత్రం తెలిసికోలేక పోతున్నారు. ఐక్యరాజ్యసమితి ఇప్పటికి ఎన్నో ఏళ్ళుగా శాంతి స్థాపన కోసం యత్నిస్తూనే ఉంది. అయినా ప్రపంచంలో ఎక్కడో ఒకచోట యుద్ధం జరుగుతూనే ఉంది.

య చ్చాపి సర్వభూతానాం బీజం త దహ మర్జున!
న త దస్తి వినా యత్ స్యా న్మయా భూతం చరాచరమ్

"అర్జునా జీవులందరినీ పుట్టించు బీజాన్ని నేనే! జంగమ స్థావరాలయిన వస్తువులలో నేను లేనిది ఏదీ లేదు." (భ.గీ. 10.39)

కాబట్టి కృష్ణుడు సర్వభూతాలకు స్వామి, సర్వకర్మల ఫలితాలను అనుభవించేవాడు (భోక్త). మన కర్మల ఫలాలు మనవి అని మనం అనుకోవచ్చును. కాని అది భ్రమ. మన కర్మ ఫలాల కన్నిటికి కృష్ణుడే ఏకైక స్వామి అని మనం తెలిసికోవాలి. ఒక కార్యాలయంలో వందలకొలది మనుషులు పనిచేస్తూ ఉండవచ్చును. కాని దాని వలన వచ్చే లాభం అంతా యజమానికే చెందుతుంది. అంతే గాని ప్రతిజీతగాడికీ చెందదు. ఆ సంగతి అందరికీ తెలుసు. ఒక బ్యాంకులో 'టెల్లర్' అనే ఉద్యోగస్థుడు "ఆహా! ఈ ధనం అంతా నాది. దీనిని నేను ఇంటికి తీసికొనిపోతాను" అని అనుకుంటే వెంటనే అతనికి కష్టాలు ప్రారంభం అవుతాయి. మనం కూడబెట్టిన ధనం అంతా మన విషయ వాంఛలకే ఖర్చుపెట్టుకోవచ్చునని మనం భావిస్తే మనం కామంతో, భోగవాంఛతోప్రవర్తిస్తున్నామని అర్థం. అలా కాక మనది అనుకునే ప్రతిదీ కృష్ణునిదే అని తెలిసికొంటే మనం విముక్తులమవుతాము. ధనం మన చేతిలోనే ఉండవచ్చును. కాని అది మనది అనుకుంటే మనం మాయలో పడినట్లే! ఈ సమస్తం కృష్ణునికి చెందింది అనే జ్ఞానం పొందినవాడే నిజమైన పండితుడు.

ఈశావాస్య మిదం సర్వం య త్కించ జగత్యాం జగత్
తేన త్యక్తేన భుంజీథా మా గృధః కస్యస్విద్ ధనమ్

"ఈ విశ్వంలోని చేతనా చేతన పదార్థాలన్నీ భగవంతుని సొత్తులే! ఆయన ఆజ్ఞకు లోబడినవే! ఎవడైనా తనకు ఎంత అవసరమో, తనకు ఎంత ప్రత్యేకించబడిందో దానిని మాత్రమే స్వీకరించాలి. అది తన సొమ్ము కాదని తెలుసు కొని ఇతరమును స్వీకరించ కూడదు." (ఈశోపనిషద్ 1)



ఈ 'ఈశావాస్య' జ్ఞానం, అంటే సర్వమూ కృష్ణుని సొత్తే అనే జ్ఞానం వ్యక్తిగతంగానే కాక, జాతి అంతటిలోను, సర్వ ప్రపంచంలోను కూడ పునరుద్ధరించబడాలి. అప్పడే ప్రపంచ శాంతి ఏర్పడుతుంది. మనం తరచు ఇతరుల శ్రేయస్సు కోరుకుంటూ నిస్వార్థంగా ప్రవర్తిస్తూ మన దేశీయులతోను, మన కుటుంబ సభ్యులతోను, ప్రంపంచంలోని అన్ని జాతుల వారితోను స్నేహంగా ఉండాలని ప్రయత్నిస్తూ ఉంటాము. ఇది కూడా మిథ్యాభావన మీదనే ఆధారపడి ఉంది. నిజానికి మన మిత్రుడు శ్రీకృష్ణుడు. మన కుటుంబానికి గాని, మన జాతికి గాని, సమస్త జగత్తుకు గాని మంచి జరగాలని కోరుకునే పక్షంలో మనం మన మనసును కృష్ణుని వైపు త్రిప్పాలి. మన ఆశయం మన కుటుంబ శ్రేయస్సు అయితే కుటుంబ సభ్యులందరికీ కృష్ణ చైతన్యం కలిగించాలి. చాలా మంది తమ తమ కుటుంబాల క్షేమం గురించి పాటు పడుతూ ఉంటారు కాని పాపం వారి కోరిక తీరదు. అసలు సమస్య ఏమిటో వారికి తెలియదు. భాగవతం (5.5.18)లో చెప్పినట్లు తన సంతానాన్ని మృత్యువు నుంచి, ప్రకృతి బంధనం నుంచి రక్షించలేని వాడు తండ్రి కావడానికి గాని, గురువు కావడానికి గాని అనర్హుడు. ప్రతి తండ్రి కృష్ణ జ్ఞానం కలవాడై అమాయకులైన తన సంతానానికి మళ్ళీ జన్మబంధం లేకుండా చేయడానికి కృతనిశ్చయుడై దుఃఖం ఇక ఏ మాత్రం అనుభవించనవసరం లేని విధంగా వారికి శిక్షణ ఇవ్వడానికి నిర్ణయించుకోవాలి. కాని, ఆ పని చేయడానికి ముందు అతడు దానిని గురించి పూర్తిగా తెలిసికొని ఉండాలి. అతడు స్వయంగా కృష్ణ విజ్ఞానంలో నిష్ణాతుడు కావాలి. అప్పుడే తన పిల్లలకు సంఘానికి మేలు చేయగలుగుతాడు. అలాకాక అతడే స్వయంగా అజ్ఞాన బంధంలో పడి ఉంటే తనలాగే అజ్ఞాన బంధంలో ఉన్న వారికి ఎలా సహాయ పడగలడు? ఇతరులను తరింప చేయడానికి ముందు తాను స్వయంగా తరించిన వాడై ఉండాలి. నిజానికి ఎవడూ ముక్తుడు

కాడు. ప్రతివాడు ప్రకృతి ప్రభావానికి లోబడిన వాడే! అయితే కృష్ణుణ్ణి ఆశ్రయించిన వారిని మాయ ఏమీ చేయలేదు. అతడొక్కడే ముక్తుడు. ఎండలోఉన్నవాడికి చీకటితో బాధపడవలసిన అవసరం ఉండదు. కాని, కృత్రిమ కాంతిలో ఉండేవాడికి ఆ ప్రమాదం ఉంది. ఆ కృత్రిమ కాంతి ఏ క్షణాన్నైనా ఆరిపోవచ్చును. శ్రీకృష్ణుడు ఎండవంటి వాడు. అతడున్న చోట చీకటి గాని, అవిద్యగాని ఉండే ప్రశ్నలేదు. జ్ఞానులకు, మహాత్ములకు ఈ విషయం తెలుస్తుంది.

అహం సర్వస్య ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే
ఇతి మత్వా భజంతే మాం బుధా భావ సమన్వితాః

"సమస్త ఆధ్యాత్మిక, భౌతిక ప్రపంచాలకు నేనే కారణభూతుణ్ణి. సమస్తమూ నానుంచే పుడుతుంది. దీనిని పూర్తిగా గ్రహించిన పండితులు భక్తి యుక్తమైన నాసేవలో నిమగ్నులై హృదయపూర్వకంగా నన్ను పూజిస్తారు." (భ.గీ. 10.8)

ఈ శ్లోకంలో 'బుధులు' అనే పదాన్ని వాడారు. 'బుద్ధిమంతులు', 'పండితులు' అని దీని అర్థం. అటువంటి వారి లక్షణం ఏమిటి? సమస్తం కృష్ణుని నుంచే పుడుతుందని వారికి తెలియడం. భౌతిక జగత్తులో లైంగికాకర్షణ చాలా ప్రధానమైంది. అన్ని రకాల ప్రాణులలోను, మైథునశక్తి కనిపిస్తుంది. అది ఎక్కడ నుంచి వచ్చింది? ఆ స్వభావం శ్రీకృష్ణునిలోనే ఉంది, అది గొల్లభామలతో ఆయనకు ఉన్న సంబంధాన్ని బట్టి తెలుస్తుంది. ఈ సంగతి జ్ఞానులకు తెలుసు. భౌతిక జగత్తులో కనిపించే ప్రతి విషయం కృష్ణునిలో పరిపూర్ణ రూపంలో, అఖండంగా కనిపిస్తుంది.అయితే రెండింటికీ భేదం ఏమిటంటే భౌతిక జగత్తులోని ప్రతి విషయం వ్యత్యస్తంగా కనిపించినా కృష్ణునిలో శుద్ధ చైతన్యంలో - లోకాతీతమైన రూపంలో అభివ్యక్తం అవుతుంది. సంపూర్ణ జ్ఞానంతో దీనిని గ్రహించిన వారే కృష్ణుని శుద్ధ భక్తులు.



మహాత్మానస్తు మాం పార్థ! దైవీం ప్రకృతి మాశ్రితాః
భజం త్యనన్యమనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్

సతతం కీర్తయంతో మాం యతంతశ్చ దృఢవ్రతాః
నమస్యంతశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే

"ఓ పృథా కుమారా! భ్రాంత చిత్తులు కాని మహాత్ములు పరాప్రకృతి రక్షణంలో ఉంటారు. వారు నన్ను ఆద్యుడు అనంతుడు అయిన దేవాది దేవుడుగా గుర్తిస్తారు. భక్తి యుక్తమైన నా సేవలో వారు సంపూర్ణంగా నిమగ్నులై ఉంటారు. ఎల్లప్పుడు నా వైభవాలను కీర్తిస్తూ , దృఢ నిశ్చయంతో ముక్తికై ప్రయత్నిస్తూ, నాకు ప్రణమిల్లుతూ నిత్యం నన్ను భక్తితో పూజిస్తారు." (భ.గీ. 9.13,14)

పైన 'ఈ మహాత్ములు' అని చెప్పబడింది. వీరు ఎవరు? 'పరాశక్తి' ప్రభావంలో ఉన్నవారు. ప్రస్తుతం మనం కృష్ణుని అపరా శక్తి ప్రభావంలో ఉన్నాము. జీవాత్మలము కాబట్టి పరా, అపరా శక్తులకు మధ్య తటస్థులుగా ఉన్నాము. మనం ఈ రెండిటిలో దేనినైనా చేరవచ్చును. కృష్ణుడు సంపూర్ణ స్వతంత్రుడు. మనం ఆయన లోని అంశలము కాబట్టి ఆ స్వాతంత్ర్య లక్షణం మనలో కూడా ఉంది. అందుచేత మనం ఏ ప్రకృతి అధీనంలో ఉండాలో మన ఇష్ట ప్రకారం కోరుకోవచ్చును. పరా శక్తిని గురించి మనకు తెలియదు. కాబట్టి మనం అపరా శక్తికి లోబడి ఉండ వలసి వస్తుంది. మనం ఇప్పుడనుభవిస్తున్న ప్రకృతి కన్న వేరే ప్రకృతి లేదు కాబట్టి దీనిని నాశనం చేసి శూన్యంగా మిగిలిపోవడమే ఈ సమస్యకు పరిష్కారం అని కొన్ని దర్శనాలు సిద్ధాంతీకరిస్తున్నాయి. కాని మనం చైతన్యులము గనుక మనం శూన్యమై పోవడం ఎన్నటికి జరుగదు. మనం శరీరాలను మార్చుకున్నంత మాత్రాన శూన్యమైపోతామని అర్థం కాదు. జడ ప్రకృతి ప్రభావం నుంచి

బయట పడడానికి ముందు మనం నిజంగా ఎక్కడికి వెళ్ళుతున్నామో అర్థం చేసికోవాలి. ఎక్కడికి వెళ్ళాలో మనకు తెలియక పోతే, "ఉన్నతశక్తి ఏదో, అధమ శక్తి ఏదో మనకు తెలియక పోతే మనకు తెలిసింది ఇంతే కాబట్టి ఇక్కడే ఉండి నశిస్తాము'' అని భావిస్తాము. భగవద్గీతలో ఉన్నత అధమ శక్తులను గురించిన వివరణ ఉంది.

కృష్ణుడేది మాట్లాడినా అది అన్ని కాలాలకు వర్తిస్తుంది. అది మారదు. "ఈనాటి మన వృత్తి ఏమిటి? అలనాటి అర్జునుని వృత్తి ఏమిటి'' అనేది ముఖ్యం కాదు. మనం మన చైతన్యాన్ని మార్చుకోవాలన్నది ముఖ్యం. ప్రస్తుతం మనం మన స్వార్థ జ్ఞానాన్ని బట్టి నడుస్తున్నాము. కాని నిజానికి మనకు మన స్వార్థం తెలియదు. ఇంద్రియ ఆసక్తే తెలుసు. మనం ఏది చేసినా ఇంద్రియాల తృప్తి కోసమే చేస్తున్నాము. ఈ చైతన్యమే మారాలి. దాని స్థానంలో కృష్ణ చైతన్యాన్ని స్థాపించాలి. అదే నిజమైన 'స్వార్థం' అంటే!

మరి దానిని స్థాపించడం ఎలాగ? మన జీవితంలో అడుగడుగున కృష్ణ చైతన్యవంతులం కావడంఎలా? శ్రీకృష్ణుడు దానిని మనకు చాలా సులభం చేస్తున్నాడు.

రసోఽహ మప్సు కౌంతేయ! ప్రభాస్మి శశి సూర్యయోః
ప్రణవ స్సర్వ వేదేషు శబ్దః పౌరుషం నృషు

"కౌంతేయా! నీటిలోని రుచిని నేనే; సూర్య చంద్రులలోని కాంతిని నేనే; వేద మంత్రాలలోని ఓంకారాన్ని నేనే; ఆకాశంలోని శబ్దాన్ని, మనుష్యులలోని పౌరుషాన్ని నేనే.'' (భ.గీ. **7.8**)

మనం సర్వకాల సర్వావస్థలలోను కృష్ణ చైతన్యవంతులం ఎలా కాగలమో ఈ శ్లోకంలో దేవాదిదేవుడు వర్ణించాడు. జీవులందరు నీరు త్రాగక తప్పదు. నీరు లేకపోతే బ్రతుక లేము. నీటి రుచి ఎంత గొప్పదంటే మనకు దాహం



వేసినప్పుడు నీరు తప్ప ఇంకేం త్రాగినా తృప్తి కలుగదు. ఏ కర్మాగారం కూడా నీటి రుచిని ఉత్పత్తి చేయలేదు. అందుచేత నీరు త్రాగినప్పుడు కృష్ణుణ్ణి స్మరించుకోవాలి. నీరు త్రాగకుండా ఒక్కరోజు కూడా గడువదు కదా! అంటే కృష్ణ చైతన్యం నీటి రుచిలో ఉంది. దానిని ఎలా మనం మరచిపోగలం?

అదే విధంగా ఏదైనా వెలుతురు వచ్చినప్పుడు అది కూడా కృష్ణుడే! ఆధ్యాత్మికాకాశంలో మూల తేజస్సు అతడే అంటే బ్రహ్మజ్యోతి కృష్ణుడే! ఆ 'బ్రహ్మజ్యోతి' కృష్ణ శరీరం నుంచి బయటకు వచ్చి ఈ జడాకాశాన్ని కప్పుతూంది. ఈ భౌతిక జగత్తు నిజ స్వభావం చీకటి. చీకటిని మనం రాత్రులందు అనుభవిస్తున్నాము. రాత్రులందు కనిపించే వెన్నెల కూడా సూర్యుడిచ్చిందే; చంద్రునిపై ప్రతి బింబించిన సూర్యుని కాంతి అది! మనం విద్యుచ్ఛక్తితో దీపాలు వెలిగించుకుంటున్నాము. అంటే మొత్తం కృత్రిమ కాంతితోనే మనం రాత్రి పూట వెలుతురును పొంద గలుగుతున్నాము. సూర్యుని కాంతి ఎక్కడ నుంచి వస్తున్నది? 'బ్రహ్మజ్యోతి' నుంచి వస్తూంది. అంటే ఆధ్యాత్మికాకాశం నుంచి మహోజ్జ్వలమైన తేజస్సు సూర్యుణ్ణి చేరుతుంది. ఆధ్యాత్మికాకాశంలో సూర్య చంద్రుల అవసరం ఉండదు. అక్కడ ప్రతివస్తువు 'బ్రహ్మజ్యోతి' నుంచే కాంతిని పొందుతుంది. ఈ లోకంలో సూర్యకాంతిని చూసినప్పుడెల్ల మనం కృష్ణుణ్ణి స్మరించాలి!

ఓంకారంతో ప్రారంభించే వేదపాఠం విన్నప్పుడు కూడా మనం కృష్ణుణ్ణి స్మరించాలి. 'హరే కృష్ణ' లాగ 'ఓంకారం' కూడా శ్రీకృష్ణుని నామమే! ఓంకారం కూడా కృష్ణుడే! ఏ ధ్వని (శబ్దం) అయినా మూలధ్వని తాలూకు ప్రకంపనమే అని మనం గ్రహించాలి. ఆ మూలధ్వనే 'ఓం'. అదే 'హరే కృష్ణ'. భౌతిక ప్రపంచంలో మనకు వినబడే ప్రతిశబ్దం ఆ మూలధ్వని అయిన 'ఓంకారం' తాలూకు ప్రతిధ్వనే. ఈ విధంగా శబ్దం వినిపించినప్పుడు,

నీళ్ళు త్రాగేటప్పుడు వెలుతురు కనిపించినప్పుడు మనం దేవాదిదేవుణ్ణి స్మరించాలి! అలా గనుక మనం చేయగలిగితే మనం కృష్ణుని స్మరించని క్షణం అంటూ ఉండదు. ఇదీ కృష్ణ చైతన్య విధానం. ఇలా చేస్తే దినంలో ఇరువైనాలుగు గంటలు మనం కృష్ణుణ్ణి స్మరించ గలం, కృష్ణుడు మనతోనే ఉంటాడు. నిజానికి కృష్ణుడు సర్వదా మనతోనే ఉన్నాడు. ఆ విషయం మనం గుర్తుకు తెచ్చుకున్న వెంటనే కృష్ణుని సన్నిధి యథార్థమై మన అనుభవంలోకి వస్తుంది.

కృష్ణుని సాన్నిధ్యాన్ని అనుభవించడానికి తొమ్మిది విధాలైన పద్ధతులున్నాయి. మొదటిది శ్రవణం - అంటే వినడం. భగవద్గీత చదవడం వలన మనం శ్రీకృష్ణుని వాక్కులను వింటున్నామని, నిజంగానే కృష్ణుని సహవాసం చేస్తున్నామని అర్థం. (కృష్ణుని గురించి మాట్లాడినప్పుడెల్ల మనం భగవంతుని గురించి మాట్లాడుతున్నామని మరచిపోకూడదు.) భగవంతునితో సహజీవనం చేస్తూ భగవద్ వాక్కులను, నామాలను స్మరిస్తూ కాలం గడుపుతూ ఉంటే క్రమంగా జడ ప్రకృతి సంపర్కం వలన కలిగిన దోషాలు తగ్గి పోతాయి. కృష్ణుడే శబ్దము, వెలుతురు, నీరు ఇంకా ఎన్నో పదార్థాల రూపంలో ఉన్నాడని తెలిసికొంటే కృష్ణుని తప్పించుకోడం అసాధ్యమవుతుంది. ఈ పద్ధతిలో మనం కృష్ణుణ్ణి స్మరించగలిగితే నిరంతరంగా ఆయన దివ్య సాన్నిధ్యం మనకు అనుభూతం అవుతుంది.

కృష్ణుని సాన్నిధ్యం ఎండలో కూర్చోడం లాంటిది. ఎండ ఉంటే అక్కడ అశుచి అనేది ఉండదు. ఆరుబయట సూర్యుని కిరణాలలో కూర్చున్నంత సేపూ మనకు ఏ వ్యాధీ రాదు. సర్వ వ్యాధులకు సూర్యకాంతి చికిత్సగా ప్రశంసించబడుతుంది. వ్యాధిగ్రస్తుడు ఆరోగ్యం పొందడం కోసం సూర్యుణ్ణి ఆరాధించాలని శాస్త్రాలు చెబుతున్నాయి. అలాగే మనం కృష్ణ చైతన్యంలో, కృష్ణుని సన్నిధిలో ఉంటే మన వ్యాధులన్నీ నయం అవుతాయి. 'హరే కృష్ణ'





జపంతో కృష్ణుణ్ణి చేరుకోగలము. త్రాగే నీటిలో కృష్ణుని చూడగలము. సూర్యునిలో, చంద్రునిలో కృష్ణుని చూడగలము; శబ్దంలో కృష్ణుని వినగలము. నీటిలో కృష్ణుని రుచి చూడగలము. దురదృష్టవశాత్తు మన వర్తమాన పరిస్థితులలో కృష్ణుణ్ణి మనం మరచిపోయాము. ఇప్పుడైనా మేల్కొని కృష్ణ స్మరణ ద్వారా ఆధ్యాత్మిక జీవితాన్ని మనం పునరుద్ధరించుకోవాలి.

ఈ శ్రవణ, కీర్తన విధానం చైతన్య మహాప్రభువు ఆమోదం పొందింది. తన మిత్రుడు, మహా భక్తుడు అయిన రామానంద రాయనితో సంభాషిస్తూ చైతన్య మహాప్రభువు ఆత్మ సాక్షాత్కారం గురించి అతనిని ప్రశ్నించారు. రామానందుడు వర్ణాశ్రమ ధర్మాలను గురించి, వైరాగ్యం, కర్మ సన్న్యాసం మొదలైన అనేక మార్గాలను గురించి చెప్పాడు. అప్పుడు చైతన్య మహాప్రభువు: "కావు. అవన్నీ ఏమంత ఉత్తమమైన మార్గాలు కావు" అన్నాడు. రామానందుడు ఏదో మార్గం చెప్పినప్పుడెల్ల చైతన్య మహాప్రభువు ఆధ్యాత్మికాభివృద్ధికి అంతకంటె మంచి మార్గం చెప్పుమని అడుగుతూ వచ్చాడు. చివరకు రామానందరాయడు ఒక వేద మంత్రాన్ని ఉదాహరించి, దాని ప్రకారం పరమార్థాన్ని చేరడం ఊహా కల్పనలతో సాధ్యం కాదు కాబట్టి, దేవాదిదేవుని తెలిసికోడానికి అనవసర ప్రయత్నాలను తర్కవితర్కాలను మానుకోవాలని చెప్పాడు. విజ్ఞాన శాస్త్రజ్ఞులు అతి దూరంలో ఉన్న నక్షత్రాలను గురించి, గ్రహాలను గురించి ఊహా గానాలు చేస్తారు. అయితే వారు అనుభవం ద్వారా మాత్రమే ఏదైనా నిర్ణయానికి రాగలరు. అలాగే ఎవరైనా దేనిని గురించి అయినా జీవితం అంతా ఊహా కల్పనలతోను, అనుమానాలతోను గడిపినా, ప్రత్యక్షానుభవం లేకపోతే ఎప్పటికి దేనిని నిర్ణయించ లేరు.

ముఖ్యంగా భగవంతుని గురించిన ఊహా కల్పనలు నిరూపయోగం. అందుకే ఊహా కల్పనలను విరమించు కోవాలని శ్రీమద్ భాగవతం చెబుతూంది. దానికి బదులుగా తాను అత్యల్పుడనని, ఈ విశాల విశ్వంలో

ఈ భూమి ఒక అతి అల్పమైన అణువు అని గ్రహించి వినయం అలవరచుకోడం మంచిదని ఉపదేశించింది. న్యూయార్క్ నగరం చాలా పెద్దదిగా కనిపించవచ్చును. కాని నిజానికి ఈ భూగోళమే అత్యల్పమైన అణువు వంటిదని, దానిలో అమెరికా సంయుక్త రాష్ట్రాలు ఒక చిన్న భాగమని ఆ దేశంలో న్యూయార్క్ నగరం ఇంకా చిన్నదని, న్యూయార్క్‌లోని వ్యక్తి లక్షలమందిలో ఒకడని గ్రహించిన మరుక్షణం తాను అసలు ఏమాత్రం లెక్కలోకి రాదగినవాడు కాడని తెలుస్తుంది. బ్రహ్మాండంతోను, దేవ దేవునితోను పోల్చి చూసుకున్నప్పుడు మన అల్పత్వాన్ని గుర్తించి గర్వాన్ని విడిచి వినయం అలవరచుకుంటాము. కూపస్థ మండూక వేదాంతం లో పడిపోకుండా జాగ్రత్త పడాలి. ఒకప్పుడు ఒక నూతిలో ఒక కప్ప ఉండేది. దాని మిత్రుడు అట్లాంటిక్ మహా సముద్రం అనేది ఒకటి ఉందని చెప్పాడు. అప్పుడా కప్ప తన మిత్రుణ్ణి ఇలా అడిగిందట:

"అట్లాంటిక్ సముద్రం అంటే ఏమిటి?''

"అది ఒక మహా విశాలమైన సముద్రం'' అన్నాడు మిత్రుడు.

"ఎంత విశాలమైన దేమిటి? ఈ నూతికి రెట్టింపు ఉంటుందా?''

"అబ్బే! అలాగేమీ కాదు. ఇంకా చాలా చాలా పెద్దది'' అన్నాడు మిత్రుడు.

"ఇంకా ఎంత పెద్దది? దీనికి పది రెట్లుంటుందా?'' అంటూ తానున్న కూపాన్ని ఆధారంగా చేసుకునే ఆ కప్ప ఆలోచించుకుంటూ పోయింది. ఆ కప్పకు అట్లాంటిక్ మహా సముద్రం లోతు గురించి గాని, వైశాల్యం గురించి గాని అర్థం చేసికోడం సాధ్యమయే పని కాదు. అలాగే మన సామర్థ్యాలు, అనుభవాలు, కల్పనా శక్తి అన్నీ పరిమితమైనవి. కనుక మనం కూడా ఆ కూపస్థ మండూకం లాగే ఆలోచించ గలము. అందు వలన దేవాదిదేవుణ్ణి అర్థం చేసికోడానికి ప్రయత్నించడంలో ఊహా పద్ధతి వృధా కాలయాపన మాత్రమే అని శ్రీమద్భాగవతం ఉపదేశిస్తుంది.



అయితే ఊహలు వదలిపెట్టి మనం ఏం చేయాలి? వినయం కలిగి ఉండి, వినమ్రులమై భగవంతుని ఉపదేశాలను మనం వినాలని భాగవతం ప్రబోధిస్తుంది. అలాంటి ఉపదేశం భగవద్గీతలోను, వేద సాహిత్యంలోను కనిపిస్తుంది. బైబిలు, ఖురానులలోను, ఏ ప్రసిద్ధ మత గ్రంథంలోనైనా కనిపిస్తుంది. లేకపోతే జీవన్ముక్తుల నుంచి తెలిసి కోవచ్చును. ముఖ్య విషయం ఏమిటంటే భగవంతుణ్ణి గురించి శ్రవణం చేయాలే గాని, ఊరకే ఊహించుకోరాదని. మరి అలాంటి శ్రవణానికి ఫలితం ఏమిటి? శ్రవణం చేసేవారు ఎవరైనా సరే - దరిద్రుడు గాని, ధనికుడు గాని, అమెరికన్ గాని, భారతీయుడు గాని, బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులలో ఎవరైనా గాని - భగవంతుని దివ్యనామం వింటే ఎలాంటి శక్తి అతనిని జయించలేదు. కేవలం భగవానుని మీది ప్రేమ ఒక్కటే అతనిని జయింప గలదు. అర్జునుడు కృష్ణునికి మిత్రుడు. కాని దేవాది దేవుడైన కృష్ణుడు ఒక సేవకునిలాగ అర్జునునికి రథసారథి అయాడు. అర్జునుడు కృష్ణుని ప్రేమించాడు కాబట్టి, కృష్ణుడు తన ప్రేమను ఆ విధంగా ప్రదర్శించాడు. అలాగే శ్రీకృష్ణుడు బాలుడుగా ఉన్నప్పుడు తన పెంపుడు తండ్రి అయిన నందుని పాద రక్షలను తన నెత్తిమీద పెట్టుకున్నాడు. వాటితో ఆడుకుంటున్నట్లు నటించాడు. దేవాది దేవునితో ఐక్యం పొందడానికి ఎవరైనా ఎంతో ప్రయత్నించ వచ్చును గాని నిజానికి అంత కంటె ఎక్కువే పొందుతారు. మనం భగవంతుని తండ్రులము కావచ్చును. సర్వ జీవులకు భగవంతుడే తండ్రి అనేది యథార్థమే; దేవాది దేవునికి తండ్రి లేని మాట నిజమే. దేవదేవుడు తన భక్తుణ్ణి తండ్రిగా స్వీకరించి, అతని వాత్సల్యం అనుభవించి, అతని చేత జయింపబడడానికి అంగీకరిస్తాడు. మనం చేయవలసింది ఒక్కటే, దేవాది దేవుని ఉపదేశాన్ని శ్రద్ధగా వినడమే!

భగవద్గీత 7 వ అధ్యాయంలో శ్రీకృష్ణుడు జీవితంలో అడుగడుగున తనను తెలిసికోడానికి మరో కొన్ని మార్గాలను చూపించాడు:

పుణ్యో గంధః పృథివ్యాం చ తేజ శ్చాస్మి విభావసౌ
జీవనం సర్వభూతేషు తప శ్చాస్మి తపస్విషు

"నేను భూమి తాలూకు సువాసనను; అగ్నిలోని వేడిమిని. జీవించే సమస్త ప్రాణులలోని ప్రాణాన్ని, తపస్వులలోని తపస్సును." (భ.గీ. 7.9)

'పుణ్యో గంధః' అనే మాటలకు సువాసనలు అని అర్థం. కృష్ణుడు మాత్రమే మంచి వాసనలను, రుచులను సృష్టించగలడు. రసాయనాలతో మనం కృత్రిమ సుగంధ ద్రవ్యాలను తయారు చేయగలమేమో గాని అవి ప్రకృతి సిద్ధములైన పరిమళాలంత శ్రేష్ఠమైనవి మాత్రం కావు. ప్రకృతి సిద్ధమైన పరిమళాన్ని ఆఘ్రాణించి నప్పుడు "ఆహా! భగవంతుడిక్కడ ఉన్నాడు. కృష్ణుడిక్కడ ఉన్నాడు" అనిపిస్తుంది. ఒక సహజ సౌందర్యాన్ని చూసినప్పుడు "ఇదిగో కృష్ణుడు!" అనిపిస్తుంది. లేదా అసాధారణం, మహాశక్తి మంతం, అద్భుతం అయిన దానిని కాంచినప్పుడు "ఇదిగో కృష్ణుడు!" అనుకుంటాము. అలాగే చెట్లలో గాని, మొక్కలలోగాని, మృగాలలో గాని, మానవులలో గాని ఏ విధమైన చైతన్యం కనిపించినా ఆ చైతన్యం కృష్ణునిలోని అంశమే. అని మనం గ్రహించాలి. కృష్ణాంశమైన ప్రాణం అనే అగ్ని స్ఫులింగం ఆయా దేహాల నుంచి వెళ్ళి పోగానే అవి కుళ్ళి పోవడం ప్రారంభిస్తాయి.

బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ! సనాతనమ్
బుద్ధి ర్బుద్ధిమతా మస్మి తేజ స్తేజస్వినా మహమ్

"ఓ పృథా కుమారా! నేను అన్ని భూతాలకు ఆద్య కారణాన్ని అని, బుద్ధి మంతులలోని బుద్ధినని, శక్తిమంతులలోని శక్తినని తెలిసికో!" (భ.గీ. 7.10)

ఇక్కడ కృష్ణుడు సర్వప్రాణులలోని ప్రాణం తానేనని మళ్ళీ ప్రత్యేకంగా చెప్పాడు. ఈ విధంగా ప్రతిక్షణం మనం భగవంతుణ్ణి చూడవచ్చును. "నీవు దేవాది దేవుణ్ణి నాకు చూపించ గలవా?" అని ఎవరైనా మనలను



అడుగవచ్చును. తప్పక చూపించ గలము. భగవంతుడు అనేక విధాలుగా కనిపిస్తాడు. కళ్ళు మూసుకొని "నాకు దేవుడు కనబడడంలేదు" అనే వారికి దేవాది దేవుడు ఎలా కనిపిస్తాడు?

పై శ్లోకంలో 'బీజమ్' అంటే 'విత్తనం' అని అర్థం. ఆ విత్తనం సనాతనమైంది. ఒక పెద్ద చెట్టు ఉందనుకోండి. దాని మూలం ఏది? దాని విత్తనమే! ఆ విత్తనం శాశ్వతం. ప్రతి ప్రాణి లోపల దాని ఉనికి తాలూకు బీజం ఉంటుంది. శరీరం అనేక మార్పులను పొందుతుంది - తల్లి గర్భంలో పెరుగడం, చిన్న పరిమాణంలో శిశువు పుట్టడం, కౌమార యౌవన దశలను పొందడం జరుగ వచ్చును - కాని వీటన్నిటికి మూలమై అంతర్గతమై ఉండే బీజం మాత్రం నిత్యం. అందుచేతనే అది సనాతనం. మనకు తెలియకుండానే మనం మన శరీరాలను ప్రతిక్షణం మార్చుకుంటున్నాము. కాని, ఆ విత్తనం, ఆ చైతన్య స్ఫులింగం మారదు. ప్రతి వస్తువులోను ఉన్న ఆ శాశ్వత బీజం తానేనని కృష్ణుడు చాటుతున్నాడు. బుద్ధిమంతులలోని బుద్ధి కూడా ఆయనే! శ్రీకృష్ణుని అనుగ్రహం లేకపోతే ఎవరికీ అసాధారణ ప్రజ్ఞ అలవడదు. ప్రతివాడు, ఇతరుల కంటె తాను ఎక్కువ తెలివిగా కనిపించడానికి ప్రయత్నిస్తాడు. కృష్ణానుగ్రహం లేకపోతే అది సంభవం కాదు. అందుచేత అసాధారణ ప్రజ్ఞ కలవారెవరైనా మనకు ఎదురైనప్పుడు "ఈ ప్రజ్ఞ కృష్ణుడు" అని మనం తెలిసి కోవాలి. అదే విధంగా మహా ప్రభావం కలవారి ప్రభావం కూడా కృష్ణుడే!

బలం బలవతాం చాహం కామ రాగ వివర్జితమ్
ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ!

"భారత వంశస్థులలో శ్రేష్ఠుడవైన ఓ అర్జునా! నేను బలశాలులలోని బలాన్ని; నా బలం కామ, రాగాలు లేనిది. మత నియమాలను ఉల్లంఘించని లైంగికసుఖాన్ని కూడా నేనే!" (భ.గీ. 7.11)

ఏనుగు, గెరిల్లా అనే పెద్ద కోతి చాలా బలం కల జంతువులు. వాటికి ఆ బలం కృష్ణుని నుంచే వచ్చిందని మనం గ్రహించాలి. మనిషి తన ప్రయత్నంతో అంత బలాన్ని సంపాదించ లేడు. కాని కృష్ణుని అనుగ్రహం వలన అంతకన్నా వేయిరెట్లు ఎక్కువ బలాన్ని పొందగలదు. అలాగే మత నియమాలకు అనుగుణమైన లైంగికానందం కూడా కృష్ణుడుగానే భావించాలి, 'కామం' అంటే ఏమిటి? 'కామం' అంటే సంభోగ వాంఛ; ఇక్కడ మత సూత్రాలకు విరుద్ధం కాని లైంగిక జీవనం అంటే మంచి సంతానాన్ని పొందడానికి సాధనమైన 'కామం'. కృష్ణ చైతన్యం గల సంతానాన్ని పొందేటట్లయితే వేయి సార్లైనా కామ సౌఖ్యాన్ని అనుభవించ వచ్చును. కాని, పిల్లులు కుక్కల మనస్తత్వం కల సంతానాన్ని పొందితే అతని కామం మత నియమాలకు విరుద్ధమైన దవుతుంది. ధార్మిక నాగరిక సంఘాలలో వివాహానికి లక్ష్యం దంపతులు మంచి సంతానం పొందడమే! కాబట్టి వివాహంతో ముడిపడిన దాంపత్యం ధర్మ సమ్మతం. అలాగే వివాహం చేసుకోని మైథునం ధర్మ విరుద్ధం. నిజానికి శాస్త్రీయ పద్ధతులలో గడిపే వివాహిత జీవితానికి సన్న్యాసానికి ఎలాంటి భేదం లేదు.

యే చైవ సాత్త్వికా భావా రాజసా స్తామసా శ్చ వై
మత్త ఏవేతి తాన్ విద్ధి న త్వహం తేషు తే మయి

“సత్త్వ గుణంతోను, రజో గుణంతోను తమో గుణంతోను కూడిన భావాలన్నీ నా శక్తి చేతనే అభివ్యక్తం అయాయని తెలిసికో! ఒక విధంగా నేను సర్వాన్ని అయినా నేను స్వతంత్రుణ్ణి! నేను ప్రకృతి గుణాలకు లోబడి ఉండను. కాని అవి నాయందే ఉంటాయి.” (భ.గీ. 7.12)

కృష్ణుణ్ణి ఎవరైనా ఈ విధంగా అడుగ వచ్చును: “శబ్దం, నీరు, వెలుతురు, పరిమళం - సమస్తానికి బీజం, బలం, కామం నీవే అంటున్నావు.



అంటే మంచి భావాలలో మాత్రమే నీవు ఉంటావని అర్థమా? భౌతిక ప్రపంచంలో సాత్త్విక, రాజస, తామస భావాలున్నాయి. ఇంతవరకు సాత్త్విక భావాలే నేనని చెప్పుకున్నావు (ఉదాహరణకు ధర్మ సమ్మతమైన కామం). అయితే ఇతర భావాల మాటేమిటి? వాటిలో నీవు ఉండవా?” దానికి సమాధానంగా “భౌతిక ప్రపంచంలో కనబడే ప్రతి భావం (అంటే వస్తువు) సత్త్వ రజ స్తమో గుణాల కలయిక వలననే ఏర్పడుతుంది. అన్ని సందర్భాలలోను ఈ మూడు గుణాలు నా చేతనే సృష్టించబడుతున్నాయి” అని కృష్ణుడంటున్నాడు. కృష్ణుని చేత సృష్టించబడినవి కావడం వలన వాటి స్థానం కూడా కృష్ణుని లోనే ఉంది. కాని, కృష్ణుడు వాటిలో ఉండడు. కారణం - కృష్ణుడు వాటికి అతీతుడు. అంటే అర్థం ఏమిటంటే అవిద్య వలన కలిగే అశుభాలు, అమంగళాలు అన్నీ కూడా కృష్ణుడే! ఎప్పుడూ? అవి కృష్ణుని చేత ప్రయోగించబడినప్పుడు. అది ఎలా? ఉదాహరణకు ఒక ఇంజనీరు విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేస్తున్నాడు. మనం ఈ విద్యుచ్ఛక్తిని మన ఇళ్ళలో ఫ్రిజ్‌లో చల్లదనం కోసం, కరెంటు పొయ్యిలలో వేడికోసం వాడుతున్నాము. అయితే ఉత్పత్తి అయినప్పుడు అది చల్లగాను ఉండదు; వేడిగాను ఉండదు. ఆయా వాడకాలను బట్టి దాని స్థితి మారుతుంది. అలాగే కృష్ణుని శక్తి ఉపయోగాలు కూడా ఆయా జీవాత్మలకు వేర్వేరు రకాలుగా ఉంటాయి. కాని, కృష్ణునికి మాత్రం ఆ శక్తి ఒకే రకంగా ఉంటుంది. అందుచేతనే కృష్ణుడు కొన్ని సమయాలలో కాముకుని గాను, అజ్ఞాని గాను నటిస్తాడు. కాని కృష్ణుడు కృష్ణుడే! ఉత్పత్తి చేసే ఇంజనీరుకు అది కేవలం విద్యుత్ శక్తే! అతని దృష్టిలో 'ఉష్ణ విద్యుచ్ఛక్తి', 'శీతల విద్యుచ్ఛక్తి' అనే భేదం ఉండదు.

ప్రపంచంలోని ప్రతి పదార్థాన్ని కృష్ణుడే ఉత్పత్తి చేస్తున్నాడు. దీనినే “అథాతో బ్రహ్మ జిజ్ఞాసా, జన్మాద్యస్య యతః” అని 'వేదాంత సూత్రాలు'

ప్రతిపాదిస్తున్నాయి. ప్రతిప్రాణి బద్ధజీవి కాబట్టి ఆ ప్రాణిని బట్టి మంచి, చెడ్డలు నిర్ణయిస్తాము - కాని, కృష్ణుడు అలా బద్ధుడు కాడు కాబట్టి ఆయనకు మంచి చెడుల భేదాలను ఆపాదించలేము. మనం బద్ధులము కాబట్టి మనం ద్వంద్వాల వలన బాధలు పడుతున్నాము. కృష్ణునికి అలా కాదు. అయనకు ప్రతిదీ సంపూర్ణమే!

# 4. అజ్ఞానుల మార్గాలు, జ్ఞానుల మార్గాలు

కృష్ణుడు తనను గురించి యథాతథంగా వివరిస్తున్నాడు. అయినా మనం కృష్ణుని వైపు ఆకర్షితులం కాలేక పోతున్నాము. ఎందుచేత? దానికి గల కారణాన్ని కృష్ణుడే స్వయంగా ఇలా చెప్పాడు:

దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా
మా మేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే

"భౌతిక ప్రకృతికి సంబంధించిన మూడు గుణాలతో కూడిన నా మాయా శక్తి దాటడానికి శక్యం కానిది. అయితే నన్ను శరణు పొందిన వారు మాత్రం దానిని సులభంగా దాట గలుగుతారు." (భ.గీ. 7.14)

భౌతిక ప్రకృతిలో మూడు గుణాలు వ్యాపించి ఉన్నాయి. జీవులందరు వాటి ప్రభావానికి లోబడి ఉంటారు. సత్త్వ గుణ ప్రభావం ఉన్నవారు బ్రాహ్మణులు. రజో గుణ ప్రభావితులు క్షత్రియులు. రజో గుణం, తమో గుణం - రెండిటి చేత ప్రభావితులైన వారు వైశ్యులు. కేవలం తమో గుణం గల వారు శూద్రులు. ఇది జన్మలను బట్టి కాని, సాంఘికమైన అంతస్తును బట్టి కాని ఏర్పరచిన విభాగం కాదు. వ్యక్తుల గుణాలను బట్టి, నైజాన్ని బట్టి నిర్ణయించబడిన విభాగం.

చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః
తస్య కర్తార మపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్

"సత్త్వ రజ స్తమో గుణాల ననుసరించి, వారు వారు ఆచరించే కర్మలను అనుసరించి మానవ సంఘాన్ని నాలుగు జాతులుగా నేను విభజించాను.

ఆ నాలుగు వర్ణాలను సృష్టించిన వాడను నేనే అయినప్పటికి, నేను మార్పులేని వాడను కావడం వలన నేను 'అకర్త'ను (అంటే వాటికి నేను అతీతుడును) అని నీవు తెలిసికోవాలి!'' (భ.గీ. 4.13)

ఇది ప్రస్తుతం భారతదేశంలో కనిపించే విపరీత చాతుర్వర్ణ్య వ్యవస్థను గురించి చెప్పిన మాట కాదు. శ్రీకృష్ణుడు స్వయంగా: "గుణకర్మ విభాగశః'' అంటున్నాడు. వారి వారి గుణాలను బట్టి, వారి నైజాలను బట్టి మానవులు నాలుగు విభాగాలుగా విభజించ బడ్డారు. అందుచేత ప్రపంచంలో ఉన్న మనుష్యులందరికీ ఇది వర్తిస్తుంది. కృష్ణుడు ఏది చెప్పినా అది ఏదో కొందరికి మాత్రమే పరిమితం కాదని, అది సార్వత్రిక సత్యమని మనం గ్రహించాలి. సర్వ జీవులకు తానే తండ్రినని చెప్పుకుంటున్నాడు కనుక జంతువులకు, జల చరాలకు, వృక్షాలకు, పురుగులకు, పక్షులకు, ఈగలకు కూడా ఆయనే తండ్రి! అన్ని జీవులు కృష్ణుని సంతానమే! భౌతిక ప్రకృతి లోని మూడు గుణాల పారస్పరిక చర్యల వలననే ప్రపంచం అంతా అజ్ఞానంలో పడిందని, మనం కూడా ఆ అజ్ఞాన ప్రభావంలో ఉన్నవాళ్ళమే అని, అందుచేతనే మనం భగవంతుని తెలిసి కోలేక పోతున్నామనీ శ్రీకృష్ణుడు స్పష్టంగా ప్రకటించాడు.

ఈ మాయ స్వభావం ఎటువంటిది? దానిని జయించడం ఎలాగ? అది కూడ భగవద్గీతలో వివరించబడింది:

దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా
మామేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే

"భౌతిక ప్రకృతి లోని మూడు గుణాలకు సంబంధించిన నా మాయా శక్తి దాటడానికి శక్యం కానిది. నన్ను శరణు పొందిన వారు మాత్రం దానిని సులభంగా దాట గలుగుతారు.'' (భ.గీ. 7.14)



భౌతిక ప్రకృతి లోని ఈ మూడు గుణాల చిక్కును కేవలం ఊహా పోహల ద్వారా ఎవరూ వదలించుకోలేరు. ఈ మూడు గుణాలు చాలా బలమైనవి, జయించడానికి వీలు కానివి. ఈ భౌతిక ప్రకృతి బలమైన బంధనంలో మనం బందీలమై ఉన్నట్లు మన అనుభవం ద్వారా మనకు తెలియడం లేదా? తెలుస్తుంది. గుణము అనే పదానికి త్రాడు అనే అర్థం కూడా ఉంది. ఎవడైనా మూడు బలమైన త్రాళ్ళతో కట్టి వేయబడితే ఎటూ తప్పించు కోలేడు. మంచితనం, కామావేశం, అజ్ఞానం అనే మూడు బలమైన త్రాళ్ళతో మన కాళ్ళు చేతులు బంధించబడి ఉన్నాయి. అయితే మనకిక విముక్తి లేదని ఆశ వదలు కోవలసిందేనా? అక్కరలేదు. తనను శరణు వేడిన వారెవరైనా వెంటనే ఈ బంధనాల నుంచి విముక్తులవుతారని కృష్ణుడు అభయం ఇస్తున్నాడు. అంటే కృష్ణ చైతన్యం పొందిన వాడు ఈ బంధనాల నుంచి విముక్తుడవుతాడు.

మనం అందరం శ్రీకృష్ణుని పుత్రులము. కాబట్టి మనకు కృష్ణునితో సంబంధం ఉంది. కుమారునికి తండ్రితో అభిప్రాయ భేదం ఏర్పడవచ్చును. అయినా, పితృ పుత్ర సంబంధం త్రెంచుకోడం సాధ్యం కాదు. జీవితంలో ఎప్పుడైనా ఎవరైనా "నీవు ఎవరవు?'' అని అడిగితే "నేను ఫలానా వారి అబ్బాయిని'' అని చెప్పవలసి ఉంటుంది. ఆ బంధుత్వం ఎన్నటికి తెగిపోదు. అలాగే మనం అందరం దేవాది దేవుని పుత్రులము. ఆయనతో మనకు గల సంబంధం నిత్యమైంది. కాని, మనం దానిని స్మరించడం లేదు. కృష్ణుడు సర్వ శక్తిమంతుడు, మహా కీర్తిమంతుడు, సర్వ సంపన్నుడు, అత్యంత సుందరాకారుడు, సర్వజ్ఞుడు. అంతేకాదు, సంపూర్ణ త్యాగి కూడా! అంతటి పురుషోత్తమునికి మనం పుత్రులమైనప్పటికి ఆ సంగతి మనం మరచిపోయాము. ఒక ధనికుని కుమారుడు తన తండ్రిని మరచిపోతే, ఇల్లు విడచి పిచ్చివాడై తిరుగుతూ వీధిలోపడి నిద్రపోతాడు; లేకపోతే అన్నం కోసం బిచ్చమెత్తు

కుంటాడు. ఈ దురవస్థకు కారణం అతడు తన తండ్రిని మరచిపోవడమే. అయితే ఎవరైనా అతని దురవస్థకు కారణం అతడు తన తండ్రిని విడిచిపెట్టడమే నని, సంపన్నుడైన అతని తండ్రి తన కుమారుడు ఇంటికి రావాలనే ఆతురతతో ఉన్నాడని అతనికి తెలియ చెబితే అతనికి గొప్పమేలు చేసిన వారవుతారు.

ఈ భౌతిక ప్రపంచంలో మనం ఎల్లప్పుడు ఆధ్యాత్మిక, ఆధి భౌతిక, ఆధి దైవికా లయిన మూడు విధాలైన దుఃఖాలతో బాధపడుతున్నాము. శరీరం వలన, మనస్సు వలన కలిగే బాధలు ఆధ్యాత్మికమైనవి. ఇతర జీవుల వలన కలిగే బాధలు ఆధి భౌతికాలు. ఇక ప్రకృతి ప్రకోపం వలన కలిగే బాధలు ఆధి దైవికాలు. త్రిగుణాల చేత, మాయ చేత ఆవరించబడి ఉండడం వలన మనం ఈ దుఃఖాలను లెక్క చేయడం లేదు. కాని ఈ భౌతిక జగత్తులోనే ఇంత అధికంగా ఈ దుఃఖాలను అనుభవిస్తున్నామని మనం గుర్తుంచుకోవాలి. కావలసినంతగా చైతన్యాన్ని వృద్ధి చేసుకొన్నవాడు, తెలివి గలవాడు, తనకు దుఃఖం ఎందుకు కలుగుతుంది అని ప్రశ్నించుకుంటాడు. "నేను దుఃఖాలను కోరుకోడం లేదు. అయినా నేను ఎందుకిలా బాధ పడుతున్నాను?" అనుకుంటాడు. ఈ ప్రశ్న ఉత్పన్నమైతే అతడు కృష్ణ చైతన్యం పొందడానికి అవకాశం ఏర్పడుతుంది.

మనం కృష్ణునికి శరణాగతులం అయిన వెంటనే ఆయన మనకు ప్రేమతో స్వాగతం చెబుతాడు. తప్పిపోయిన బిడ్డ తండ్రి వద్దకు తిరిగివచ్చి: "తండ్రీ! అపార్థం చేసికోడం వలన నీ రక్షణకు దూరం అయాను. ఎన్నెన్నో బాధలు పడ్డాను. ఇప్పుడు మళ్ళీ నీ దగ్గరకు వచ్చాను" అంటే తండ్రి అతనిని కౌగలించుకుని: "నాయనా! వచ్చావా? నీవు వెళ్ళింది మొదలు ఇన్ని రోజులూ నీ కోసం ఎంతగానో ఎదురు చూశానయ్యా, నువ్వు మళ్ళీ వచ్చేశావు. నాకు ఇప్పుడు ఆనందంగా ఉంది" అంటాడు. తండ్రికి అంత వాత్సల్యం



ఉంటుంది. కృష్ణుడు అలాంటి తండ్రి. మనం ఆయన కృపకు దూరం అయాము. కృష్ణునికి మనం పూర్తిగా శరణాగతులం కావాలి. అది ఏమంత కష్టం కాదు. తండ్రి దగ్గరకు కొడుకు చేరుకోడం కష్టమైన పనా? అది చాలా సహజమైంది. కొడుకును స్వీకరించడానికి తండ్రి ఎప్పుడూ సిద్ధంగానే ఉంటాడు. దీనిలో మనకు అవమానం అనే ప్రశ్న లేదు, మన పరమపితను సమీపించి ఆయన పాదాలపై వ్రాలితే మన కెలాంటి నష్టం లేదు. అది కష్టమైన పని కూడా కాదు. నిజానికి అది ఎంతో కీర్తి దాయకం. మనం ఎందుకా పని చేయకూడదు? కృష్ణుని శరణు పొందడం వలన మనం వెంటనే ఆయన రక్షణ క్రిందికి వచ్చి సమస్త దుఃఖాల నుంచి విముక్తులం అవుతాము. ఇది సర్వశాస్త్ర సమ్మతం. గీతలో కృష్ణుడు ఇలా అంటున్నాడు:

సర్వ ధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ!
అహం త్వాం సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః

"వివిధ ధర్మాలను విడచి నన్ను శరణు పొందు. అన్ని పాప ఫలితాల నుంచి నిన్ను విముక్తుణ్ణి చేస్తాను. భయపడకు!" (భ.గీ. 18.66)

మనం భగవంతుని పాదాలపై వ్రాలిన వెంటనే ఆయన రక్షణలోకి వస్తాము. ఆ క్షణం నుంచి మనకిక భయం అంటూ ఉండదు. బిడ్డలు తల్లిదండ్రుల రక్షణలో ఉన్నప్పుడు తమకు హాని జరుగకుండా తల్లిదండ్రులు చూసుకుంటారు. పిల్లలు నిర్భయంగా ఉంటారు. "మా మేవ యే ప్రపద్యంతే" - 'నన్ను ఎవరైతే ఆశ్రయిస్తారో వారికి భయమే ఉండ' దని కృష్ణుడు ప్రకటించాడు.

కృష్ణునికి శరణాగతులం కావడం ఎంతో తేలిక అయినప్పటికి, మనం ఎందుకలా చేయడం లేదు? అలా చేయక పోగా, దేవాది దేవుని ఉనికిని మనలో చాలామంది ప్రశ్నిస్తున్నారు. "ప్రకృతి, విజ్ఞాన శాస్త్రం నిజమైనవి,

దేవుడు అబద్ధం'' అంటున్నారు. జ్ఞానాభివృద్ధికి, నాగరకతాభివృద్ధికి అర్థం మానవులు మరింత పిచ్చివారై పోవడమా? ఈ వ్యాధి తగ్గడానికి బదులు మరింత ముదిరి పోతూంది. మనుష్యులు దేవాది దేవుణ్ణి లెక్క చేయడం లేదు: ప్రకృతినే లెక్క చేస్తున్నారు. అందుచేతనే ప్రకృతి వారిని మూడు విధాలైన దుఃఖాలతో బాధిస్తూంది. ప్రతి దినం 24 గంటలూ మనం ప్రకృతి చేత ఇలా తన్నులు తింటూనే ఉన్నాము. కాని ఈ తన్నులు తినడం మనకు ఎంతగా అలవాటయిందంటే, అది మనకు హాయిగానే ఉన్నట్టు అనిపిస్తుంది. ఏదో సాధారణ విషయంలాగ కనిపిస్తూంది. మనం నేర్చుకుంటున్న విద్యను చూసుకుని మనం గర్వపడుతున్నాము. పైగా భౌతిక ప్రకృతితో: "మమ్మలను తన్నుతున్నందుకు నీకు కృతజ్ఞులము. దయగేసి నిత్యం ఇలా తన్నుతూనే ఉండు!'' అంటూన్నాము. ఇలాంటి భ్రమలో పడి ప్రకృతిని జయించాలని అనుకుంటున్నాము. అంతేకాని, ఇది ఇలా ఎందుకు జరుగుతుంది? జన్మ మృత్యు జరా వ్యాధి దుఃఖాలతో ప్రకృతి మనలను బాధిస్తూ ఉంది కదా! ఈ సమస్యలను మనం పరిష్కరించుకున్నామా? వీటిని పరిష్కరించకపోతే జ్ఞానంలోను, నాగరకతలోను మనం ఏ రకమైన ప్రగతిని సాధించినట్లు? ప్రకృతి అనుల్లంఘనీయమైన శాసనాలకు బద్ధులమైపోయి, పైగా ప్రకృతిని జయించామని భ్రమిస్తున్నాము. 'మాయ' అంటే ఇదే!

దేహాన్నిచ్చిన తండ్రికి శరణాగతుడు కావడం కొంత కష్టంగా అనిపించ వచ్చును. ఎందుకంటే అతడు సామాన్యుడు. అతని జ్ఞానం, సామర్థ్యం పరిమితాలు. కాని, కృష్ణుడు అలాంటి సామాన్యమైన తండ్రి కాడు. ఆయన అనంతుడు; ఆయన జ్ఞానం, శక్తి, సంపద, సౌందర్యం, కీర్తి, వైరాగ్యం అపరిమితాలు; పరిపూర్ణాలు! అలాంటి తండ్రి దగ్గర చేరి ఆయన సంపదలను అనుభవించడం మన అదృష్టం అని మనం భావించాలి. అయితే ఎవరూ దీనిని పట్టించుకోడం లేదు. పైగా, ఇప్పుడు దేవదేవుడు లేనేలేడని



కూడా ప్రచారం చేస్తున్నారు. మనుష్యులు ఎందుకు ఆయనను వెదకి కనుగొనడం లేదు? దీనికి సమాధానం భగవద్గీతలోని తరువాతి శ్లోకంలో చెప్పబడింది:

న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యంతే నరాధమాః
మాయయాపహృత జ్ఞానా ఆసురం భావ మాశ్రితాః

"చెడ్డపనులు చేసేవారు, మూఢులు, మానవాధములు, మాయచేత అపహరించబడిన జ్ఞానం కలవారు, రాక్షసులకు సంబంధించిన నాస్తిక స్వభావం కలవారు నన్ను శరణు పొంద జాలరు." (భ.గీ. 7.15)

మూఢులు పై విధంగా వర్గీకరించబడ్డారు. దుష్కృతుడైన వాడు శాస్త్ర విధులకు వ్యతిరేకి. వేద విధులను ధిక్కరించడమే నాగరికతగా భావిస్తాడు. ఈ లక్షణాన్ని బట్టి సుకృతుడు అంటే శాస్త్ర ధిక్కారం చేయనివాడు అని భావించాలి. సుకృతునికి దుష్కృతునికి గల భేదం నిర్ణయించడానికి ఒక కొలబద్ద ఉండాలి. ప్రతి నాగరిక దేశానికి ఒక పవిత్ర గ్రంథం ఉంటుంది. హిందువులకు వేదాలు, క్రైస్తవులకు బైబిలు, ముస్లిములకు ఖురాను, బౌద్ధులకు ధమ్మపథం - ఇలా ఏదో ఒక ప్రామాణిక గ్రంథం ఉంటుంది. దాని ప్రకారం నడువని వాడు వెలివేయ బడుతాడు. అతనినే 'దుష్కృతుడు' అంటారు.

ఈ శ్లోకంలో పేర్కొనబడిన మరో వర్గం, 'మూఢుడు'. 'నరాధముడు'- ఇతడు మానవ సంఘంలో అట్టడుగున ఉన్న వాడు. 'మాయాపహృత చేతసులు' అంటే మాయ చేత లేక భ్రాంతి చేత అపహరించబడిన జ్ఞానం కలవారు. 'ఆసురం భావ మాశ్రితాః' అంటే పూర్తిగా నాస్తికులు. జగజ్జనకుణ్ణి ఆశ్రయించడంలో ఏ నష్టం లేకపోయినా ఈ నాలుగు వర్గాల వారు ఆయనను ఆశ్రయించరు. దానికి ఫలితంగా దేవాదిదేవుని కింకరుల చేత

నిత్యం దండించబడుతారు. వారి చెంపలను పగుల గొట్టడం, బెత్తంతో బాదడం, ఎడాపెడా తన్నడం చేయక తప్పదు. ఆ దండనలను వారు అనుభవించి తీరాలి. చెడు తిరుగుళ్ళు తిరిగే కుమారుణ్ణి తండ్రి దండించినట్లు ప్రకృతి అట్టి మూఢులకు కొన్ని దండనలు విధించవలసి వస్తుంది. అయినా ప్రకృతి మనకు ఆహారాన్ని, ఇతర అవసరాలను అందిస్తూ పోషిస్తూ ఉంటుంది. అపరిమితైశ్వర్యవంతుని బిడ్డలము గనుక ఈ సౌకర్యాలు మనకు కొనసాగుతూ ఉంటాయి. మనం శరణు పొందినా, పొందక పోయినా కృష్ణుడు మనపై దయ చూపిస్తూనే ఉంటాడు. ఈ విధంగా మనం మన తండ్రి ద్వారా ఎన్నో సౌకర్యాలు పొందుతున్నప్పటికి 'దుష్కృతుడు' నిషిద్ధ కర్మలు చేస్తూనే ఉంటాడు. వాటికి తగిన దండనలు అనుభవిస్తూనే ఉంటాడు. ఈ మానవ శరీరాన్ని కృష్ణుని తెలిసికోడానికి ఉపయోగించని వాడు 'నరాధముడు'. మన అసలైన తండ్రి శ్రీకృష్ణునితో మన బాంధవ్యాన్ని పునరుద్ధరించు కోడానికి తన శరీరాన్ని ఉపయోగించని వాడు మానవులలో అట్టడుగున ఉన్నవాడని పరిగణించాలి.

జంతువులు ఆహారం తీసుకుంటాయి. నిద్రపోతాయి, మైథునం చేస్తాయి, ఆత్మ రక్షణ చేసుకుంటాయి, చివరికి మరణిస్తాయి. అవి ఉత్తమ చైతన్యాన్ని ఉపయోగించుకోలేవు. అధమ జాతి ప్రాణుల కది సాధ్యం కాదు. మనిషి కూడా పశువుల లాగే ప్రవర్తిస్తూ, తన చైతన్యాన్ని పెంచుకునే అవకాశాన్ని ఉపయోగించుకోకపోతే మానవ స్థాయి నుంచి పతనమై మరుసటి జన్మలో పశువై జన్మిస్తాడు. శ్రీకృష్ణుని అనుగ్రహం వలన మనకు మంచి శక్తి గల శరీరం, బుద్ధి లభించాయి. మనం వాటిని ఉపయోగించుకోకపోతే కృష్ణుడు వాటిని మళ్ళీ మనకు ఎందుకిస్తాడు? అనేక లక్షల సంవత్సరాల పరిణామం ఫలితంగా మనకు ఈ మానవ దేహం లభించింది. 84 లక్షల జీవరాసుల దేహాలలో జీవిస్తూ క్రమ పరిణామం చెందుతూ, పరిభ్రమిస్తూ ఉన్న



జీవాత్మకు ఈ జనన మరణ సంసార చక్రం నుంచి విముక్తి పొందడానికి ఈ మానవ శరీరం మంచి అవకాశాన్ని కలుగ జేస్తుంది. ఈ అవకాశం కేవలం కృష్ణుని కృప చేతనే మనకు కలిగింది. దీనిని జారవిడుచుకుంటే మనం నరాధములం కాక మరేమి అవుతాము? ఏదో ఒక విశ్వవిద్యాలయం నుంచి మనం ఎం.ఏ., పి.హెచ్‌డి. పట్టాలను సంపాదించినా, మాయాశక్తి ఈ లౌకిక విజ్ఞానాన్ని అపహరించి వేస్తుంది. నిజంగా బుద్ధిమంతుడైన వాడు తాను ఎవరో దేవదేవుడు ఎవరో, భౌతిక ప్రకృతి ఎలాంటిదో, ఈ ప్రకృతి చేతిలో చిక్కుకుని, ఎందుకు తాను దుఃఖాన్ని అనుభవిస్తున్నాడో, ఆ దుఃఖ నివారణకు ఉపాయం ఏమిటో తెలిసి కోవడానికి తన తెలివిని ఉపయోగిస్తాడు.

మన ఇంద్రియాల ఆనందం కోసం మోటారు బండినో దూరదర్శనినో ఆకాశవాణి యంత్రాన్నో నిర్మించడానికి మన తెలివిని ఉపయోగిస్తున్నాము. కాని భగవంతుడు మనకు జ్ఞానాన్ని ఇచ్చింది ఇందుకు కాదని మనం గుర్తించడం లేదు. నిజమైన జీవిత సమస్యలను అర్థం చేసికోడానికి మనకు జ్ఞానం ప్రసాదించ బడింది. కాని దానిని ఇతర విషయాలకై ఉపయోగించ రాదు. మనుష్యులు మోటారు బళ్ళు నిర్మించడం, వాటిని నడుపడం నేర్చుకుని అదే విద్య అనుకుంటున్నారు. అయితే ఈ మోటారు బళ్ళు నిర్మించక పూర్వం కూడా ప్రజలు ప్రయాణాలు చేస్తూనే ఉన్నారు. ఇప్పుడు సౌకర్యం కొంచెం పెరిగి ఉండవచ్చు. దానితో పాటు వాతావరణ కాలుష్యం అనే కొత్త సమస్య ఏర్పడింది. ఇదే 'మాయ' అంటే! మనం సౌకర్యాలను ఏర్పాటు చేసుకుంటున్నాము. ఆ సౌకర్యాలు మనకు కొత్త సమస్యలను తెచ్చి పెడుతున్నాయి.

ఇన్ని ఆధునిక సౌకర్యాలను సృష్టించుకోడంలో మన శక్తిని వ్యర్థం చేసే బదులు, అదే శక్తిని మనం ఎవరో తెలిసికోడానికి ఉపయోగించాలి. మనకు దుఃఖాలను అనుభవించడం ఇష్టం లేదు కాబట్టి, మన మీద దుఃఖం

బలవంతంగా ఎందుకు రుద్దబడుతూందో మనం గ్రహించాలి. విజ్ఞానం అనబడే దానితో అణ్వాస్త్రం అనే మారణాస్త్రాన్ని నిర్మించడంలో మాత్రం మనం చాలా త్వరత్వరగా అభివృద్ధి సాధిస్తున్నాము. పైగా ఇది గొప్ప విజ్ఞాన ప్రగతి అని విర్రవీగు తున్నాము. అలా కాక మరణాన్ని నివారించే ఉపాయాన్ని కనిపెట్టగలిగితే అప్పుడు విజ్ఞానంలో నిజంగా మనం ముందడుగు వేసినట్లవుతుంది. మృత్యువు అనేది భౌతిక ప్రకృతిలో ఎప్పటి నుంచో ఉంది. కేవలం ఒకే ఒక్క అణ్వాస్త్రంతో ఎందరినో చంపి, మృత్యువును మరింత త్వరగా ఆహ్వానించడానికి మనం ఉబలాట పడుతున్నాము. ఇదే 'మాయయాపహృత జ్ఞానాః' - అంటే మాయచేత అపహరించబడిన జ్ఞానం కలవారు చేసే పనులు ఇవి.

ఆసురులు, రాక్షసులు ప్రముఖ నిరీశ్వర వాదులు, దేవాదిదేవుడు లేడని సవాలు చేస్తారు. జగజ్జనకుడే లేకపోతే మనం జన్మించి ఉండే వాళ్ళం కాదు. మరి ఆయన లేడని అనడంలో అర్థం ఏమిటి? మానవులలో దేవతలు రాక్షసులు అని రెండు వర్గాలు ఉన్నట్టు వేదాలు చెబుతున్నాయి. దేవతలంటే ఎవరు? దేవాదిదేవుని భక్తులు. ఆయన వలెనే ప్రవర్తిసారు గనుక వారిని దేవతలు అంటారు. దేవాదిదేవుని శాసనాలను ధిక్కరించిన వారు రాక్షసులు. ఈ రెండు వర్గాల వారు మానవ సంఘంలో ఎప్పుడూ ఉంటారు.

కృష్ణునికి శరణాగతి చేయని పాపాత్ములు నాలుగు విధాలుగా ఉన్నట్లే ఆయనను పూజించే అదృష్టవంతులు కూడా నాలుగు రకాలైన వారు ఉన్నారు. వారిని గురించి ఈ దిగువ శ్లోకం వివరిస్తూంది:

*చతుర్విధా భజంతే మాం జనాః సుకృతినోఽర్జున!*
*ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ!*

"భరతవంశ శ్రేష్ఠుడవైన అర్జునా! ఆపదలో ఉన్నవారు, సంపదను కోరేవారు, జ్ఞానాన్ని వాంఛించేవారు, పరమాత్మ జ్ఞానాన్ని అన్వేషించేవారు - అని నాలుగు విధాలైన పుణ్యాత్ములు నాకు భక్తియుక్తమైన సేవ చేస్తారు." (భ.గీ. 7.16)



ఈ భౌతిక జగత్తు దుఃఖ మయం. మంచి వారు చెడ్డవారు అందరు దుఃఖానికి గురి అయే వారే. చలికాలంలో చలి అందరిని బాధిస్తుంది. చలికి సజ్జనుడు, దుర్జనుడు, ధనికుడు, పేదవాడు అనే భేదం లేదు. అయితే సజ్జనులకు, దుర్జనులకు భేదం ఎక్కడ ఉంది? అంటే దుఃఖం కలిగినప్పుడు సజ్జనుడు దేవాదిదేవుణ్ణి స్మరిస్తాడు. సాధారణంగా కష్టంలో ఉన్నవాడు ప్రార్థనాలయానికి వెళ్ళి ప్రార్థనలు చేస్తాడు. ఏమని? "ఓ దేవాదిదేవా! నేను కష్టంలో ఉన్నాను. దయచేసి నన్ను రక్షించు!" అని లౌకిక సుఖం కోసమే అతడు ప్రార్థించినా దుఃఖంలో భగవంతుణ్ణి మరచిపోలేదు గనుక అతనిని కూడా సజ్జనుడుగానే భావించాలి. అలాగే ఒక పేదవాడు చర్చికి వెళ్ళి: "ఓ దేవా! నాకు కొంత ధనం ప్రసాదించు!" అని ప్రార్థిస్తాడు. జిజ్ఞాసువులు అలా కాదు. వారు తెలివైన వారు. ప్రపంచాన్ని అర్థం చేసికోడానికి వారు ప్రయత్నిస్తారు. "దేవుడంటే ఎవరు?" అని వారు ప్రశ్నించుకుని సమాధానం కోసం శాస్త్రీయ పరిశోధనలు జరుపుతారు. వారు యోగ్యమైన విషయం గురించి పరిశోధనలు చేస్తున్నారు గనుక వారు కూడా సుకృతులే! జ్ఞానం కలవానిని జ్ఞాని అంటారు. అంటే తన స్వరూప స్థితిని తెలిసికొన్నవాడు. అటువంటి జ్ఞానికి దేవుడు నిర్గుణుడనే భావం ఏర్పడవచ్చు. అయితే పరబ్రహ్మ తత్త్వాన్ని ఆశ్రయించిన వాడు కాబట్టి అతడు కూడ సుకృతిగానే లెక్కించబడుతాడు. ఈ నాలుగు రకాల వారు ఈశ్వరవాదులు గనుక సుకృతులు అనబడుతారు.

*తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తి ర్విశిష్యతే*
*ప్రియో హి జ్ఞానినోఽత్యర్థ మహం స చ మమ ప్రియః*

"వారిలో సంపూర్ణ జ్ఞానం కలవాడు, సర్వదా విశుద్ధభక్తి యుక్త సేవలో నిమగ్నుడైన వాడు అత్యుత్తముడు. అతనికి నేను చాల ఇష్టమైన వాడను. అలాగే అతడు కూడా నాకు మిక్కిలి ఇష్టుడు." (భ.గీ. 7.17)

దేవాదిదేవుని విశ్వసించే ఈ నాలుగు విధాల వ్యక్తులలో భగవంతుని స్వరూపాన్ని తెలిసి కోడానికి భక్తి శ్రద్ధలతో ప్రయత్నిస్తూ కృష్ణ చైతన్యం పొందడానికి సాధన చేసేవాడు 'విశిష్యతే', అంటే మిక్కిలి యోగ్యుడు. అటువంటి వాడికి భగవంతుని తత్త్వం తెలిసి కోడం తప్ప వేరే పని ఉండదు గనుక, అతడు కృష్ణునికి అత్యంత ప్రియమైన వాడు. ఇక మిగిలిన వారు యోగ్యతములు కారు. నిజానికి ఎవరికైనా ఏదైనా కావలసి ఉంటే దేవాదిదేవుణ్ణి ప్రార్థించవలసిన అవసరం లేదు. అలా చేసేవాడు నిజానికి మూర్ఖుడు. సర్వజ్ఞుడైన భగవంతుడు తన హృదయంలోనే ఉంటాడన్న సంగతి అతడు గ్రహించలేదు. ఎవరికి ఎప్పుడు ఏ కష్టం వస్తుందో, ఎప్పుడు డబ్బు అవసరం వస్తుందో అన్నీ ఆ భగవంతునికి తెలుసు. ఈ విషయం జ్ఞాని గుర్తిస్తాడు గనుకనే, అతడు భౌతిక దుఃఖ నివారణ కోసం భగవంతుణ్ణి ప్రార్థించడు. మరేమి చేస్తాడు? భగవంతుని దివ్య గుణాలను కీర్తిస్తాడు, భగవంతుని మహిమలను గురించి ఇతరులకు చెబుతాడు. సద్భక్తుడు స్వార్థం కోసం, అన్న వస్త్రాల కోసం, ఇల్లూ వాకిలి కోసం వేడుకోడు. ఆపదలో ఉన్నప్పుడు: "దేవాదిదేవా! ఈ కష్టం కూడా నీ దయవలనే కలిగింది. నన్ను బాగు చేయడం కోసమే నీవు నాకీ కష్టాన్ని కల్పించావు. ఇంతకంటె పెద్ద కష్టం నాకు దాపురించవలసింది కాని నామీద వాత్సల్యం వలన నువ్వు దానిని చిన్న కష్టంగా మార్చి వేశావు'' అని ప్రార్థిస్తాడు. నిశ్చల హృదయుడైన కేవల భక్తుని దృక్పథం ఇలా ఉంటుంది.

కృష్ణ చైతన్యంలో ఉండేవాడు భౌతిక దుఃఖాలకు దూరంగా ఉంటాడు కాబట్టి దుఃఖాలను గాని, సమ్మాన అవమానాలను గాని లెక్క చేయడు. మానావమానాలు, సుఖదుఃఖాలు శరీర ధర్మాలని, తాను శరీరం కాదని అతనికి తెలుసు. ఉదాహరణకు, సోక్రటీస్ ఆత్మ నిత్యమని తెలిసిన జ్ఞాని. ఆయనకు మరణ శిక్ష విధించబడినప్పుడు - "నిన్ను ఏ విధంగా సమాధి



చేయాలని కోరుకుంటున్నావు?'' అని అడిగారు. అప్పుడు ఆయన: "మీరు నన్ను పట్టుకోగలిగినప్పటి మాట కదా!'' అన్నాడు. తాను శరీరం కాదు అని తెలిసికొన్న వాడికి ఎవరైనా తనను పట్టుకోడం బాధ పెట్టడం, చంపడం లాంటివి ఏవీ చేయలేరని తెలుసు. అందుచేత అతడు భయపడడు. కృష్ణ చైతన్యవంతునికి తాను తన శరీరం కాదని, తాను కృష్ణుని అంశం అని అదే తనకూ శ్రీకృష్ణునికీ మధ్యనున్న అసలైన బాంధవ్యమని, తాను ఈ భౌతిక శరీరంలో ప్రవేశించినా ప్రకృతి గుణాలకు దూరంగా ఉండాలని చక్కగా తెలుసు. సాత్త్విక, రాజస, తామస ప్రవృత్తులతో అతనికి సంబంధం లేదు. ఉన్నదల్లా కృష్ణుని తోనే! ఈ సంగతి గ్రహించిన వాడు జ్ఞాని, బుద్ధిమంతుడు, కృష్ణునికి పరమ ప్రీతి పాత్రుడు. ఆపదలో ఉన్న వాడికి ఒక్కమారుగా ఐశ్వర్యం సిద్ధిస్తే ఒక్కొక్కసారి అతడు దేవాదిదేవుణ్ణి మరచిపోవచ్చునేమో కాని, దేవుని తత్త్వం గ్రహించిన జ్ఞాని మాత్రం ఆయనను ఎన్నటికి మరచిపోడు.

జ్ఞానులలో నిరాకార వాదుల వర్గం ఒకటి ఉంది. నిరాకారుణ్ణి ఆరాధించడం సాధ్యం కాదు కనుక భగవంతునికి ఒక రూపం ఉన్నట్లు కల్పించుకోవాలని వారు అంటారు. వారు నిజమైన జ్ఞానులు కారు; మూర్ఖులు. భగవంతుని మహత్త్వం సర్వాధికం. కావా రూపాన్ని ఎవరూ ఊహించలేరు. భగవంతుని ఊహించుకుని కల్పించుకోవచ్చును. కాని లనుకుంటే ఎవరైనా ఒక రూపాన్ని ఊహించుకుని కల్పించుకోవచ్చును. కాని అది అతని కల్పన మాత్రమే అవుతుంది. అది భగవంతుని నిజ స్వరూపం కాదు. దేవాదిదేవునికి రూపం కల్పించేవారు, రూపం లేదనే వారు - ఈ రెండు వర్గాల వారు జ్ఞానులు కారు. భారతదేశంలో జరిగే హిందూ ముస్లిమ్ మత కలహాలలో ముస్లిములు హిందూ దేవాలయాలను, హిందువులు మహమ్మదీయుల మసీదులను ధ్వంసం చేసి మేము హిందూ దేవుణ్ణి చంపాము, మేము ముస్లిమ్ ఖుదాను చంపాము అని అనుకుంటారు. అలాగే

మహాత్మాగాంధీ సత్యాగ్రహోద్యమం నడుపుతున్నప్పుడు చాలామంది భారతీయులు వీధులలో పెట్టి ఉన్న తపాలా పెట్టెలను ధ్వంసం చేసి, ప్రభుత్వ తపాలా శాఖను నాశనం చేశామని అనుకునేవారు. అలాంటి మనస్తత్త్వం ఉన్నవారు జ్ఞానులు కారు. హిందూ ముస్లిముల మధ్య క్రైస్తవ క్రైస్తవేతరుల మధ్య జగిగిన అనేక మత యుద్ధాలకు ఈ అజ్ఞానమే కారణం. జ్ఞానం ఉన్న వానికి భగవంతుడు ఒక్కడే అని, హిందూ, ముస్లిము, క్రైస్తవ దేవుళ్ళంటూ వేర్వేరుగా ఉండరని తెలుస్తుంది.

భగవంతుడు ఇలా ఉంటాడు, అలా ఉంటాడు అని అనేదంతా కేవలం మన కల్పన, మన ఊహ. జ్ఞానికి భగవంతుడు అతీంద్రియుడని తెలుస్తుంది. భగవంతుడు భౌతిక గుణాలకు అతీతుడని గ్రహించిన వాడే భగవంతుణ్ణి నిజంగా తెలిసికొన్న వాడు. భగవంతుడు ఎల్లప్పుడు మన ప్రక్కనే మన హృదయాలలోనే ఉంటాడు. మనం ఈ శరీరం విడిచినప్పుడు ఆ భగవంతుడు కూడా మనతో పాటు వస్తాడు. మనం మరొక శరీరంలో ప్రవేశించినప్పుడు తానూ ప్రవేశించి, మనం ఏం చేస్తామో చూస్తూ ఉంటాడు. మనం అతనికి ఎప్పుడు ఉన్ముఖులమవుతామో అని సదా ఎదురు చూస్తూ ఉంటాడు. అతనికి ఉన్ముఖులం అయిన వెంటనే "రా! కుమారా! - స చ మమ ప్రియః - నీవు ఎప్పుడూ నాకు ప్రియమైన వాడవే. నీ విపుడు నావైపు తిరిగావు గనుక నాకు చాలా సంతోషంగా ఉంది" అంటాడు.

జ్ఞాని భగవద్విజ్ఞాన శాస్త్రాన్ని యథాతథంగా అవగాహన చేసుకుంటాడు. 'భగవంతుడు మంచివాడు' అని మాత్రమే తెలిసికొన్నవాడు ప్రాథమిక దశలో ఉన్నవాడని అర్థం. దేవదేవుడు నిజంగా ఎంత గొప్పవాడో, ఎంతటి దయామయుడో తెలిసికొన్న వాడు మరి కొంత పురోగతి సంపాదించిన వాడు. ఆ జ్ఞానాన్ని అతడు శ్రీమద్భాగవతం నుంచి, భగవద్గీత నుంచి పొందవచ్చును. భగవంతుని పట్ల నిజంగా ఆసక్తి ఉన్నవారు భగవంతుని గురించి చెప్పే శాస్త్రం అయిన భగవద్గీతను అధ్యయనం చేయాలి.



ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యా మ్యనసూయవే
జ్ఞానం విజ్ఞాన సహితం యజ్ జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్

"ప్రియమైన అర్జునా! నీకు నా పట్ల ఎప్పుడూ అసూయ లేదు. కాబట్టి అనుభవ సహితమైన ఈ రహస్య జ్ఞానాన్ని నీకు తెలుపుతాను. దీనిని తెలిసికొని నీవు భౌతిక జీవిత దుఃఖాల నుండి ముక్తుడవు కాగలవు." (భ.గీ. 9.1)

భగవద్గీతలో ఉపదేశించబడిన తత్త్వజ్ఞానం బహు సూక్ష్మమైంది, రహస్యమైంది. అది జ్ఞానం (తాత్త్వికం). అది విజ్ఞానం (లౌకికం). అది అతి గుహ్యం. అయితే - దానిని తెలిసికోడం ఎలా? భగవంతుడు స్వయంగా గాని, యోగ్యుడైన గురువు ద్వారా గాని దానిని ఉపదేశిస్తాడు. భగవద్విజ్ఞానం విషయంలో అభిప్రాయ భేదాలు, అపార్థాలు సంభవించినప్పుడెల్ల తాను అవతరిస్తానని కృష్ణుడు చెప్పాడు.

జ్ఞానం వ్యామోహం (sentiment) కాదు. భక్తి వ్యామోహం కాదు. భక్తి ఒక శాస్త్రం. శ్రీల రూప గోస్వామి ఇలా అన్నారు: "వైదిక విజ్ఞానంతో సంబంధం లేని ఆధ్యాత్మిక వాదం సంఘ శాంతిని కల్లోలం చేస్తుంది." తర్క దృష్టితో, యుక్తితో, జ్ఞానంతో భక్తిరసమనే అమృతాన్ని ఆస్వాదం చేసి ఇతరులకు దానిని అందించాలి. కృష్ణ చైతన్యం కేవలం ఒక అభిరుచి లాంటిదని భావించకూడదు. సంకీర్తన, నృత్యం అన్నీ శాస్త్రోక్తమైనవి. వాటిలో పరస్పర ప్రేమ ప్రదర్శనం ఉంది, శాస్త్రం ఉంది. కృష్ణుడు జ్ఞానికి అత్యంత ప్రియమైన వాడు. కృష్ణునికి జ్ఞాని కూడా మిక్కిలి ప్రియము. కృష్ణుడు మన ప్రేమకు వేయి రెట్లు ప్రతిఫలం మనకు ఇస్తాడు. నిజానికి కృష్ణుణ్ణి ప్రేమించడానికి పరిమిత శక్తి గల మన సామర్థ్యం ఎంతటిది? అయితే మనలను ప్రేమించడానికి కృష్ణుని శక్తి మాత్రం అపారమైంది.

# 5. కృష్ణాభిసరణం

ఉదారాః సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్
ఆస్థితః స హి యుక్తాత్మా మా మేవానుత్తమాం గతిమ్

"భక్తు లందరు నిస్సంశయంగా ఉదాత్తులైన వారే! కాని నా జ్ఞానంతో కూడిన వాడు నాకు ఆత్మవంటి వాడు. అతడు దివ్యమైన నా సేవలో నిమగ్నుడై అత్యుత్తమ గతిని, అంటే నా పరమపదాన్ని చేరుకుంటాడు.'' (భ.గీ. 7.18)

ఇక్కడ ఆర్తుడుగా గాని, ధనం అర్థించేవాడుగా గాని, జిజ్ఞాసువుగా గాని, తన దగ్గరకు వచ్చే ప్రతి వాడు ఆయనకు ప్రియుడే! అయితే 'జ్ఞాని' అంటే మాత్రం తనకు అత్యంత ప్రీతి అని అంటున్నాడు కృష్ణుడు! మిగిలిన వారు కూడా ఆయనకు ప్రియులే! అంటే - భక్తి మార్గంలో నడుస్తూ ఉండే సామాన్యులు కూడా 'జ్ఞాని'తో సమానులు అవుతారని అర్థం. సాధారణంగా కొందరు ఏదో లాభం ఆశించి గుడికి వెళ్ళి, ప్రార్థించి, కోరిన ధనం లభించకపోతే భగవంతుణ్ణి ప్రార్థించడం వృథా అని నిర్ణయించి గుడికి వెళ్ళడం మానివేస్తారు. క్షుద్రమైన కోరికలతో భగవంతుణ్ణి సమీపించడంలో ఉన్న అపాయం అదే! ఉదాహరణకు ద్వితీయ ప్రపంచ మహా యుద్ధంలో జర్మన్ సైనికుల భార్యలు చాలామంది తమ తమ భర్తలు క్షేమంగా తిరిగి రావాలని ప్రార్థించడం కోసం చర్చికి వెళ్ళేవారు. కాని తమ తమ భర్తలు యుద్ధంలో మరణించారని వార్త రాగానే వారు నాస్తికులై పోయేవారు. భగవంతుడు మనకు కావలసినవి సమకూర్చే నౌకరుగా మనం భావిస్తాము. మనం అడిగింది ఆయన ఇవ్వకపోతే అసలు ఆయన లేనేలేడని అంటాము. భౌతిక ప్రయోజనాల కోసం ప్రార్థించడంలో ఆ ప్రమాదం ఉంది.



ఈ సందర్భంలో ధ్రువుడనే బాలభక్తుని కథను స్మరించ వచ్చును. ధ్రువుడు ఒక రాజ కుమారుడు. అతని వయస్సు అయిదేళ్ళు. కొన్నాళ్ళ తరువాత ధ్రువుని తండ్రి ధ్రువుని తల్లిని రాణి పదవి నుంచి తొలగించి మరొక భార్యను రాణిగా చేసుకున్నాడు. ఆమె ధ్రువుడికి సవతి తల్లి. ఆమెకు ధ్రువుని పట్ల ఈర్ష్య. ఒక నాడు ధ్రువుడు తన తండ్రి తొడ మీద కూర్చుని ఉండగా అతనిని అవమానించింది. "నువ్వు నా పుత్రుడవు కాదు. నీకు రాజుగారి ఒడిలో కూర్చునే అర్హత లేదు" అంది. అతనిని ఇవతలకు లాగి వేసింది. ధ్రువుడికి కోపం వచ్చింది. అతడు క్షత్రియ కుమారుడు. వారికి శీఘ్రంగా కోపం రావడం సహజం. ధ్రువుడికి అది పెద్ద అవమానంగా తోచింది. పూర్వం రాణిగా ఉన్న తన తల్లి దగ్గరకు వెళ్ళి:

"అమ్మా! నా సవతి తల్లి నన్ను మా నాన్న గారి ఒడిలో నుంచి క్రిందికి లాగివేసి అవమానించింది'' అన్నాడు.

"నాయనా! నేనేం చేయగలను? నేను నిస్సహాయురాలను. మీ తండ్రికి నా మీద ప్రేమలేదు'' అంది.

"అయితే దీనికి ప్రతీకారం ఏమిటి?''

"నాయనా! నువ్వేమీ చేయలేవు. భగవంతుడు సహాయం చేస్తేనే నువ్వు నీ పగ తీర్చుకోగలుగుతావు.''

"అలాగా? భగవంతుడెక్కడ ఉన్నాడమ్మా?'' అని ధ్రువుడు ఆమెను అడిగాడు.

"చాలా మంది ఋషులు, మునులు భగవంతుని దర్శనం సంపాదించడానికి అరణ్యాలకు వెళుతూ ఉంటారు. అక్కడ వారు భగవంతుని సాక్షాత్కారం కోసం తపస్సు చేస్తారు'' అని ఆమె ప్రత్యుత్తరం ఇచ్చింది.

వెంటనే ధ్రువుడు అరణ్యానికి వెళ్ళి, ప్రతి పులిని, ప్రతి ఏనుగునూ చూచి: "ఓయీ! నీవేనా భగవంతుడవు? నీవేనా భగవంతుడవు?'' అని

అడుగడం ప్రారంభించాడు. ఆ విధంగా జంతువుల నన్నిటిని అడుగుతూ ఉన్న ధ్రువుని ఉత్సాహాన్ని, జిజ్ఞాసను చూచి కృష్ణుడు ధ్రువుని విషయం కనుక్కుని రమ్మని నారదుణ్ణి పంపించాడు. నారదుడు వెంటనే ఆ అరణ్యానికి వెళ్ళి ధ్రువుణ్ణి కలుసుకున్నాడు.

"కుమారా! నువ్వు రాజ కుటుంబంలో జన్మించిన వాడవు. నువ్వు ఈ కఠిన తపశ్చర్యను సహించలేవు. ఇంటికి వెళ్ళిపో! నీ తల్లి తండ్రులు ఈపాటికి నీ కోసం బెంగ పెట్టుకుని ఉంటారు" అని నారదుడు అతనికి హితవు చెప్పాడు.

"నన్ను మార్గం నుంచి తప్పించడానికి ప్రయత్నించకండి. భగవంతుని గురించి మీకు తెలిస్తే, ఆయనను నేను దర్శించడం ఎలాగో తెలిస్తే చెప్పండి. లేకపోతే మీదారిని మీరు వెళ్ళండి. నా మనస్సును కలవరపరచకండి!" అని నారదునితో ధ్రువుడు అన్నాడు.

నారదునికి ధ్రువుని అచంచల నిశ్చయం అర్థమైంది. ధ్రువుణ్ణి తన శిష్యునిగా స్వీకరించాడు, "ఓం నమో భగవతేవాసు దేవాయ" అనే మంత్రాన్ని అతనికి ఉపదేశించాడు. ధ్రువుడు ఆ మంత్రాన్ని జపించి సిద్ధుడయాడు. భగవంతుడు అతనికి ప్రత్యక్షం అయాడు.

"నాయనా! ధ్రువా! నీకేమి కావాలి? ఏది కావాలన్నా నేను నీకు ఇస్తాను" అన్నాడు.

ధ్రువుడు ఇలా అన్నాడు: "దేవా! నా తండ్రి రాజ్యం కోసమే నేనీ కఠోర తపస్సుకు పూనుకొన్నాను. కాని, నేడు నీవు ప్రత్యక్షం అయావు. మహర్షులు మునులు కూడా నిన్ను చూడలేరు. కాని, నేను నిన్ను దర్శించాను. నిజానికి నేను ఇంటి నుంచి బయలు దేరినది కొన్ని గాజు పెంకులు సంపాదించడం కోసమే! దానికి బదులు నా కిప్పుడు అత్యంత అమూల్యమైన వజ్రం దొరికింది. ఇప్పుడు నాకు తృప్తి కలిగింది. ఇంక నాకు నిన్ను కోరవలసింది ఏదీ లేదు."



అదే విధంగా ఎవరైనా దారిద్ర్యంతో బాధపడుతున్నా లేక మరే దుఃఖంలో నైనా చిక్కుకున్నా ధ్రువుని లాగ దృఢ నిశ్చయంతో "భగవంతుణ్ణి దర్శించాలి, ఆయన అనుగ్రహాన్ని పొందాలి" అనే గట్టి పట్టుదలతో తపస్సు చెయ్యాలి. భగవంతుని దర్శిస్తే ఇంక ఏ మాత్రం లౌకిక వస్తువులపై వ్యామోహం ఉండదు. ధనార్జన యత్నం మూఢత్వం అని వారు గ్రహిస్తారు. 'మాయ'ను ప్రక్కకు నెట్టి సత్యాన్నే కోరుకుంటారు. ధ్రువుని వలె కృష్ణ చైతన్యంలో నిమగ్నులైన వారు నిత్య తృప్తులుగా ఉండి వేరేమీ కోరుకోరు.

భౌతిక విషయాలు అశాశ్వతమైనవని జ్ఞానికి తెలుసు. తాను చేసిన దానికి ప్రతిఫలాన్ని కోరడం, తన ఐశ్వర్యాన్ని చూసి ఇతరులు మెచ్చుకోవాలనుకోడం తన ధనం కారణంగా కీర్తి రావాలనుకోవడం - ఈ మూడు ధోరణులు దేహానికి సంబంధించినవే అని అతనికి తెలుసు. దేహం నశించిపోగానే అవి కూడా అంతరించి పోతాయి. తన శరీరం మరణిస్తే ఇక అతడు ఏమాత్రం ధనవంతుడు కాడు. కేవలం జీవాత్మరూపంలో ఉండి తన కర్మల ననుసరించి మరో దేహంలో ప్రవేశిస్తాడు. జ్ఞాని దానిని చూసి భయపడడని భగవద్గీత తెలుపుతూంది. అతనికి దేని స్వరూపం ఎలాంటిదో తెలుసు. ఇక ధనం సంపాదించడం కోసం తాను ఎందుకు తాపత్రయ పడాలి? "దేవదేవుడైన కృష్ణునితో నాకు శాశ్వత సంబంధం ఉంది. ఆ సంబంధాన్ని దృఢ పరచుకుంటే కృష్ణుడు నన్ను మళ్ళీ తన సామ్రాజ్యంలో చేర్చుకుంటాడు" అని అతడు భావిస్తాడు.

కృష్ణునితో మన సంబంధాన్ని తిరిగి నెలకొలుపుకొని దివ్యత్వాన్ని పొందడానికి సృష్టి ప్రక్రియ మనకు అన్ని సౌకర్యాలను కల్పిస్తూ ఉంది. అందుచేత అదే మన జీవితానికి ధ్యేయమై ఉండాలి. మనకు కావలసిన ప్రతి వస్తువును - భూమి, ధాన్యం, ఫలాలు, పాలు, ఇల్లు, వస్త్రాలు వంటి వాటిని భగవంతుడు మనకిస్తూ ఉన్నాడు. కేవలం ప్రశాంతంగా జీవిస్తూ కృష్ణ

చైతన్యాన్ని పెంపొందించుకోడమే మనం చేయవలసిన పని. అదే మన జీవిత పరమార్థం! దేవాదిదేవుడు మనకు ఇచ్చిన ఆహారం, గృహం, రక్షణ, కామం మొదలైన వానితో తృప్తిపడాలి. ఇంకా ఎక్కువ కావాలని అర్రులు సాచరాదు. నిరాడంబర జీవనం, ఉదాత్తములైన ఆలోచనలు ఉత్తమ సభ్యతా లక్షణాలు. ఆహారం గాని మైధునం కాని కర్మాగారాలలో ఉత్పత్తి అయ్యే వస్తువులు కావు. ఇవి ఇంకా మనకు అవసరమైన ఇతర పదార్థాలు భగవంతుడు మనకు సమకూరుస్తూనే ఉన్నాడు. మనం చేయవలసింది వీటినన్నిటిని చక్కగా ఉపయోగించుకుని కృష్ణ చైతన్యంతో జీవించడమే!

సుఖంగా జీవించడానికి కృష్ణ చైతన్యాన్ని పెంపొందించుకోడానికి, చివరికి ఆయన పాదాలను చేరుకోడానికి సర్వ సౌకర్యాలనూ భగవంతుడు మనకు కల్పించినప్పటికి ఈ యుగంలో జీవిస్తూన్న మనం దురదృష్ట వంతులము. మనకు ఆయుర్దాయం తక్కువగా ఉంది. తిండి, గుడ్డ, ఇల్లు, గృహస్థ జీవితం, ప్రకృతి ప్రమాదాల నుంచి రక్షణ లేని వారు చాలామంది ఉన్నారు. ఇది కలియుగం ప్రభావం. భయంకరమైన ఈ పరిస్థితిని గమనించబట్టే చైతన్య మహాప్రభువు ఈ యుగంలో ఆధ్యాత్మిక జీవితాన్ని పెంపొందించుకోడం అత్యవసరమని బోధించాడు. మరి దానిని పెంపొందించుకోడం ఎలా? దానికి సులభమార్గాన్ని కూడా చైతన్య మహాప్రభువే పేర్కొన్నాడు:

హరే ర్నామ హరే ర్నామ హరే ర్నామైవ కేవలమ్
కలౌ నాస్త్యేవ నాస్త్యేవ నాస్త్యేవ గతి రన్యధా

“ఊరక ‘హరే కృష్ణ’ అంటూ నిరంతరం కీర్తించండి.” మీరు కర్మాగారంలో ఉన్నా, నరక ప్రాయమైన ప్రదేశంలో ఉన్నా, గుడిసెలో ఉన్నా, ఆకాశాన్నంటే ఉన్నత భవనంలో ఉన్నా అదంత ముఖ్యం కాదు. “హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే / హరే రామ హరే రామ రామ రామ హరే హరే” అని



నిరంతరం జపిస్తూ ఉండండి. దానికి అయే ఖర్చు ఏమీ లేదు. ఎలాంటి అడ్డంకి లేదు. కులం, మతం, వర్ణం వంటి భేదాలు అసలే లేవు. ఎవరైనా ఈ మంత్రం జపించవచ్చును. కేవలం కీర్తనం, శ్రవణం చేస్తే చాలు.

ఏదో విధంగా కృష్ణ చైతన్యోద్యమంతో సంబంధం ఏర్పరచుకుని యోగ్యుడైన గురువు చెప్పినట్లు నడచుకుంటే అలాంటి వారు తిరిగి భగవంతుని ధామానికి చేరుకొంటారు.

బహూనాం జన్మనా మంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే
వాసుదేవ స్సర్వ మితి స మహాత్మా సుదుర్లభః

“సంపూర్ణ జ్ఞానం కలవాడు కారణాలన్నిటికి నేనే కారణం అని, నేనే సమస్తము అని తెలిసికొని అనేక జనన మరణాల అనంతరం నన్ను శరణు పొందుతాడు. అలాంటి మహాత్ములు చాలా అరుదు.” (భ.గీ. 7.19)

భగవచ్ఛాస్త్రం విషయమై తత్త్వ విచారణ అనేక జన్మలలో మనం చేయవలసి ఉంటుంది. భగవత్సాక్షాత్కారం ఎంత తేలికో, అంత కష్టమైంది. కృష్ణుని వచనాలను సత్యంగా నమ్మేవారికి ఆయన అనుభూతి సులభంగా కలుగుతుంది. అయితే తత్త్వవిచారం ద్వారా తెలిసికోడానికి ప్రయత్నించేవారు ఎంతో పరిశోధన చేసి సాధించిన జ్ఞానం ద్వారా భగవంతుని విశ్వాసం పెంపొందించుకోవలసి ఉంటుంది. ఇందుకు ఎన్నో జన్మలు అవసరమవుతాయి. పరమార్థాన్ని తెలిసికొన్న యోగులలో పలు వర్గాలవారున్నారు. వారిని తత్త్వవేత్తలు అంటారు. వారు పరతత్త్వం ద్వైత విరహితమైనది అంటారు. అంటే పరతత్త్వంలో ద్వంద్వ సృష్టి లేదు. అన్నీ సమాన స్థాయి లోనే ఉంటాయి. ఈ పరమార్థాన్ని తెలిసికొన్న వాడే తత్త్వవేత్త!

పరతత్త్వం ‘బ్రహ్మ’ అని, ‘పరమాత్మ’ అని ‘భగవంతుడు’ అని మూడు ముఖాలు కలిగి ఉందని కృష్ణుడు ప్రకటించాడు. మొదటిది - నిరాకార బ్రహ్మ. ఇది తేజోరూపం. రెండవది స్థానికంగా ప్రతి జీవిలోను ఉండే

పరమాత్మ; మూడవది భగవంతుడైన దేవదేవుడు. ఈ విధంగా పరతత్త్వాన్ని మూడు విధాలుగా దర్శించ వచ్చును. ఒక పర్వతాన్ని దూరం నుంచి చూస్తే ఒక రకంగా కనిపిస్తుంది. దగ్గరకు వెళ్ళి చూస్తే దాని మీద ఉన్న చెట్లు, చేమలు కనిపిస్తాయి. ఇక ఆ పర్వతం మీదకు ఎక్కి చూస్తే చెట్లు, మొక్కలు, జంతువులు పక్షులు ఇంకా ఎన్నో కనిపిస్తాయి. ఇక్కడ దృశ్య విషయం ఒక్కటే, పర్వతమే. దర్శనాన్ని బట్టి దృశ్యం వివిధంగా కనిపిస్తుంది. ఋషులు అనేక దృక్కోణాల నుంచి పరతత్త్వాన్ని దర్శించి అనేక విధాలుగా వర్ణించారు. మరొక ఉదాహరణం చూద్దాం. సూర్య కిరణాలు, సూర్య బింబం, సూర్యుడు ఉన్నారు. ఎండలో నిలబడితే సూర్యునిలో నిలబడినట్లు కాదు. సూర్యుని మీదనే నిలబడిన వాడు ఇతరుల దృష్టికి ఎండలో నిలబడిన వానికంటె ఉన్నత స్థితిలో ఉన్నట్లు కనిపిస్తాడు. సర్వవ్యాప్తమైన 'బ్రహ్మజ్యోతి' ప్రకాశాన్ని సూర్య కిరణాలతో పోల్చవచ్చును. సూర్య బింబాన్ని జీవాత్మతోను సూర్యబింబంలో ఉండే సూర్యదేవుణ్ణి దేవదేవునితోను పోల్చవచ్చును. వేద సాహిత్యాన్ని బట్టి భూలోకంలో నానా విధాలైన ప్రాణులున్నట్లు సూర్యలోకంలో కూడ అనేక జీవులున్నాయని, భూలోక జీవుల శరీరాలు మట్టితో చేయబడినట్లు సూర్యలోకంలోని జీవుల శరీరాలు అగ్నితో చేయబడి ఉంటాయని తెలుస్తుంది.

ప్రకృతిలో పంచ భూతాలున్నాయి - పృథివి, జలం, అగ్ని, వాయువు, ఆకాశం. ఈ భూతాలలో ఒక్కొక్క దాని ప్రాధాన్యాన్ని బట్టి విభిన్న గ్రహాలలో విభిన్న వాతావరణాలు ఏర్పడుతాయి. ఆయా గ్రహాలలో ఆయా భూతాల ప్రాధాన్యాన్ని బట్టి అక్కడి ప్రాణుల శరీరాలలో కూడా బేధాలు ఉంటాయి. అన్ని గ్రహాల మీద ప్రాణుల శరీరాలు ఒకే లాగ ఉంటాయని భావించరాదు. అయితే ఏదో రూపంలో ప్రతి శరీరంలోను పంచ భూతాలు ఉంటాయి. ఈ విధంగా కొన్ని గ్రహాలలో పృథివి ప్రధానం. కొన్నిటిలో జలం ప్రధానం. మరికొన్నిటిలో అగ్ని ప్రధానం. అలాగే కొన్నిటిలో వాయువు



ప్రధానం. మరి కొన్నిటిలో ఆకాశం ప్రధానం. కాబట్టి ఒక గ్రహంలో పృథివి ప్రధానం కాకపోయినంత మాత్రాన, మన వాతావరణం లాంటిది అక్కడ లేనంత మాత్రాన అక్కడ ప్రాణులు లేవనుకోవడం పొరపాటు. వేద సాహిత్యం ప్రకారం లెక్కలేనన్ని గ్రహాలున్నాయి. వాటి మీద అనేక విధాల శరీరాలున్న జీవులున్నాయి. మనం భౌతికమైన మార్పులు కొన్ని చేసికొని, ఇతర భౌతిక గ్రహలోకాలలో ప్రవేశించ గలుగుతున్నట్లు కొన్ని మార్పులతో దేవాదిదేవుడు నివసించే ఆధ్యాత్మిక లోకంలో ప్రవేశించే శక్తిని కూడ సంపాదించుకోవచ్చును.

యాంతి దేవవ్రతా దేవాన్ పితౄన్ యాంతి పితృవ్రతా:
భూతాని యాంతి భూతేజ్యా యాంతి మ ద్యాజినోఽపి మామ్

"దేవతలను పూజించేవారు దేవతలలో జన్మిస్తారు. పితృ దేవతలను పూజించేవారు పితృ లోకాలకు పోతారు. భూత పిశాచాలను పూజించేవారు అటువంటి వారుగానే జన్మిస్తారు. నన్ను పూజించేవారు నాతోనే నివసిస్తారు." (భ.గీ. 9.25)

ఊర్ధ్వ లోకాలకు వెళ్ళడానికి ప్రయత్నించే వారు ఆలోకాలకు వెళ్ళ గలరు. కృష్ణుని ధామమైన గోలోక బృందావనంలో ప్రవేశించాలనుకునే వారు కూడా కృష్ణ చైతన్య సాధన ద్వారా ఆ లోకం చేరుకో గలరు. భారత దేశానికి రావాలనుకునే వారు ముందుగా ఈ దేశం ఎలా ఉంటుందో వినాలను కుంటారు. మనం వెళ్ళాలనుకుంటూన్న స్థలం గురించి వినడం అద్భుతమైన అనుభవం. అలాగే దేవాదిదేవుడు నివసించే లోకం గురించి విశేషాలు తెలిసికోవాలంటే ముందుగా మనం దానిని గురించి వినాలి. మనం ఏదైనా ప్రయోగం చేసి వెంటనే అక్కడికి చేరుకోలేము. అది అసాధ్యం. అయితే వేద సారస్వతంలో కృష్ణ పరమాత్మ లోకం గురించి అనేక వర్ణనలు ఉన్నాయి. ఉదాహరణకు 'బ్రహ్మ సంహిత' లో ఇలా ఉంది:

చింతామణి ప్రకర సద్మసు కల్పవృక్ష
లక్షా వృతేషు సురభీ రభిపాలయంతమ్
లక్ష్మీ సహస్రశత సంభ్రమ సేవ్యమానమ్
గోవింద మాది పురుషం త మహం భజామి

"ఆది దేవుడు మూల పురుషుడు. గోపాలుడు సర్వకామితాలను అనుగ్రహించే వాడు. లక్షల కొలది కల్పవృక్షాల మధ్య ఉన్న చింతామణి సమూహాలతో నిర్మితమైన గృహాలలో ఉండే వాడు, కోట్ల కొలది లక్ష్మీదేవుల చేత గోపికల చేత భక్తి పూర్వకంగా సేవింపబడేవాడు అయిన గోవిందుణ్ణి నేను పూజిస్తాను." గోలోకాన్ని ఇంకా బాగా వివరించే వర్ణనలు 'బ్రహ్మ సంహిత' లో మరి కొన్ని ఉన్నాయి.

పరతత్త్వం గురించి తెలిసికోడానికి ప్రయత్నించే వారిని, వారు ధ్యానించే పరతత్త్వ రూపాన్ని బట్టి, వారి దృక్పథాన్ని బట్టి వర్గీకరించారు. నిరాకార బ్రహ్మం మీద తమ మనస్సును లగ్నం చేసేవారు బ్రహ్మవాదులు, నిర్గుణోపాసకులు. సాధారణంగా పరతత్త్వాన్ని తెలిసికోగోరేవారు మొదట బ్రహ్మజ్యోతిని తెలిసికొంటారు. హృదయంలో స్థానికంగా ఉండే పరమాత్మను ధ్యానం చేసేవారు పరమాత్మ వాదులు. దేవాదిదేవుడు తన పూర్ణాంశ రూపంలో ప్రతివారి హృదయంలోను ఆసీనుడై ఉన్నాడు. ధ్యానంతోను ఏకాగ్రత ద్వారాను ఆ రూపాన్ని దర్శించ వచ్చును. ఆయన ప్రతి హృదయంలోనే కాక సృష్టి లోని ప్రతి అణువులోను ఉన్నాడు. ఈ పరమాత్మ దర్శనం రెండవ దశ. ఇక మూడవ దశ - దేవాది దేవుడైన భగవంతుని సాక్షాత్కారం. ఈ విధంగా భగవద్దర్శనంలో మూడు దశలు ఉన్నాయి. పరతత్త్వ సాక్షాత్కారం ఒక్క జన్మలో జరుగదు. 'బహూనాం జన్మనా మంతే.' అదృష్టవంతునికి ఒక క్షణంలో కావచ్చును. కాని సామాన్యుడు



పరతత్త్వాన్ని తెలిసికోడానికి అనేక సంవత్సరాలు పట్టవచ్చును. అనేక జన్మలు కూడా పట్టవచ్చును.

అహం సర్వస్య ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే
ఇతి మత్వా భజంతే మాం బుధా భావ సమన్వితాః

"సమస్త భౌతిక ఆధ్యాత్మిక లోకాలకు నేనే కారణ భూతుణ్ణి. సర్వం నా నుంచే ప్రభవిస్తుంది. దీనిని పూర్తిగా తెలిసికొన్న పండితులు భక్తియుక్తమైన నా సేవలో నిమగ్నులై హృదయ పూర్వకంగా నన్ను అర్చిస్తారు." (భ.గీ. 10.8)

ఎవరి నుంచి ఈ విశ్వం అంతా పుడుతూందో అతడే బ్రహ్మమని 'వేదాంత సూత్రాలు' కూడా ధ్రువ పరుస్తున్నాయి. కృష్ణుడే జగత్కారణమని నిజంగా నమ్మి ఆయనను పూజిస్తే క్షణంలో మన పాపాలన్నీ నశించి పోతాయి. అలాకాక: "దేవుడు ఎలా ఉంటాడో నేను చూడాలి" అనేవాడు దశల వారీగా మొదట నిరాకార బ్రహ్మజ్యోతిని తెలిసికొని తరువాత స్థానిక పరమాత్మను తెలిసికొని చివరకు అంతిమ దశకు చేరుకుని: "ఆహా! దేవాదిదేవుడు ఇక్కడ ఉన్నాడు" అని గ్రహించ వలసి ఉంటుంది. అయితే ఈ క్రమానికి చాలా కాలం పడుతుంది. అనేక సంవత్సరాల పాటు తపస్సు చేసి పరబ్రహ్మను తెలిసికొన్నవాడు "వాసుదేవ స్సర్వమితి" - (అంతా వాసుదేవుడే) అని గ్రహిస్తాడు. 'వాసుదేవుడు' కృష్ణుని పేరు. సర్వత్ర నివసించే వాడు అని దాని అర్థం. వాసుదేవుడు జగత్కారణమని తెలిసిన వాడు "మాం ప్రపద్యతే" - ఆత్మ సమర్పణం అంటే 'ప్రపత్తి' చేసికొంటాడు. ఈ ప్రపత్తి మార్గమే సర్వోత్తమమైంది. దీనిని వెంటనే అనుసరించగలము; లేదా పలుజన్మల తపస్సు తరువాత అనుసరించ గలము. అయితే - "దేవాదిదేవుడు సర్వాధికుడు, నేను ఆయన భృత్యుడను" అని గ్రహించడం ఆయనకు శరణాగతుడు కావడం మాత్రం తప్పదు.

ఈ సంగతి గ్రహించిన జ్ఞాని వెంటనే కృష్ణునికి శరణాగతుడవుతాడు; అనేక జన్మల వరకు ఎదురు చూడడు. జీవులపట్ల భగవానునికి ఉన్న అపారమైన ప్రేమ వలన దేవాదిదేవుడు ఈ ప్రపత్తి మార్గాన్ని మనకు అనుగ్రహించాడని జ్ఞానికి తెలుసు. భౌతిక ప్రపంచంలో మూడు విధాలైన దుఃఖాలను బద్ధ జీవులమైన మనం అనుభవిస్తున్నాము. దేవాదిదేవుడు ప్రపత్తి మార్గం ద్వారా ఈ మూడు దుఃఖాల నుంచి మనకు విముక్తి కలిగిస్తున్నాడు.

ఇక్కడ ఎవరైనా ఒక ప్రశ్న అడుగవచ్చును: "దేవదేవుడే మన అందరికి పరమ ప్రాప్యుడు గదా! ఆయనకే అందరు శరణాగతి చేయవలసి ఉంది గదా! మరి - లోకంలో ఇన్ని రకాలైన పూజా విధానాలు ఎందుకు ఏర్పడ్డాయి?" అని. దీనికి సమాధానం ఈ క్రింది శ్లోకం మనకు తెలియజేస్తుంది:

కామై స్తై స్తై ర్హృతజ్ఞానాః ప్రపద్యంత్యేఽన్య దేవతాః
తం తం నియమ మాస్థాయ ప్రకృత్యా నియతాః స్వయా

"వివిధ భౌతిక వాంఛల చేత జ్ఞానం కోల్పోయిన వారై కొందరు వివిధ దేవతలను శరణు జొచ్చి, తమ సహజ ప్రకృతులకు అనుగుణంగా ప్రత్యేక పూజా నియమ నిబంధనలను అనుసరిస్తూ ఉంటారు." (భ.గీ. 7.20)

ప్రపంచంలో మానవులు అనేక విధాలుగా ఉంటారు. అనేక విధాలైన భౌతిక స్వభావాలు కలిగి ఉంటారు. సాధారణంగా ఎక్కువ మందికి మోక్షం అక్కర లేదు. కొందరు ఆధ్యాత్మిక మార్గంలో ప్రవేశించడం కేవలం యోగశక్తిని సంపాదించడానికే! భారత దేశంలో ఒక సన్న్యాసి దగ్గఱకు వెళ్ళి: "స్వామీ! నేను ఒక వ్యాధితో బాధపడుతూన్నాను. ఏదైనా ఔషధం ఇస్తారా?" అని అడుగుతారు. ఇది సర్వ సాధారణం. ఎందుచేత? "డాక్టరైతే డబ్బు అడుగుతాడు. అద్భుతాలు చేయగల ఒక స్వామి దగ్గఱకు వెడదాము" అని వారు భావిస్తారు. "నీవు ఒక ఔన్స్ బంగారం ఇస్తే నేను వంద ఔన్స్‌ల



బంగారం చేయగలను" అని చెప్పే స్వాములు కూడా ఉన్నారు. "నా దగ్గర 5 ఔన్సుల బంగారం ఉంది. దీనిని 500 ఔన్సుల బంగారంగా చేసుకుంటాను" అని చాలామంది ఆశ పడతారు. ఈ విధంగా ఆ 'స్వామి' గ్రామంలో ఉన్న బంగారాన్ని అంతటిని ప్రోగుచేసుకుని తరువాత ఎవరికీ తెలియకుండా అక్కడ నుంచి మాయమై పోతాడు. ఇది మనలోని లోపం. ఒక స్వామి దగ్గరకో, దేవాలయానికో, చర్చికో వెళ్ళినప్పుడు మనం ఎన్నో విషయవాంఛలతో వెడతాము. ఆధ్యాత్మిక జీవితం నుంచి కూడా భౌతిక లాభాలను పొందడానికి ప్రయత్నిస్తాము, కేవలం ఆరోగ్యం కోసమే యోగాభ్యాసం చేస్తాము. నిత్యం వ్యాయామం చేయడం ద్వారాను పథ్యమైన ఆహారం భుజించడం ద్వారాను మన ఆరోగ్యాన్ని మనం కాపాడుకోవచ్చును. ఆరోగ్యం కోసం యోగాభ్యాసం ఎందుకు? 'కామై స్తై స్తై ర్హృతజ్ఞానాః' - యోగం ద్వారా ఆరోగ్యాన్ని కాపాడుకుని జీవిత భోగాలను అనుభవించాలనే భౌతిక వాంఛతోను, భగవంతుణ్ని మన కోరికలు తీర్చేట్టు చేసే ఉద్దేశ్యంతోను దేవాలయానికి గాని, చర్చికి గాని మనం వెడుతున్నాము.

భౌతిక వాంఛలు కలవారు అనేక దేవతలను పూజిస్తారు. ప్రకృతి బంధనాల నుంచి విముక్తులు కావాలన్న భావమే వారికి ఉండదు. సాధ్యమైనంత ఎక్కువ లాభాన్ని పొందడానికి వారీ లోకాన్ని ఉపయోగించుకోవాలనుకుంటారు. ఉదాహరణకు వేదవాఙ్మయంలో ఎన్నో ఉపదేశాలున్నాయి. ఆరోగ్యం కోసం సూర్యుణ్ణి ఆరాధించాలి. ఒక కన్యకు మంచి భర్త దొరుకాలంటే శివుణ్ణి పూజించాలి. సౌందర్యం కోసం మరొక దేవతను, విద్య కోసం సరస్వతీ దేవిని పూజించాలి. ఈ విధంగా హిందువులు అనేక దేవతలను పూజించేవారుగా పాశ్చాత్యులకు కనిపిస్తారు. కాని, నిజానికి ఈ ఉపాసనలు దేవాదిదేవుని ఉద్దేశించినవి కాదు. అన్య దేవతలకు సంబంధించినవి మాత్రమే! ఈ దేవతలలో ఎవరూ దేవదేవుడు కాదు. దేవాదిదేవుడు ఒక్కడే!

దేవతలు మన వంటి జీవాత్మలే! తేడా ఏమిటంటే మనకంటె వారికి శక్తులు ఎక్కువ. భూలోకంలో రాజుగాని, అధ్యక్షుడు గాని, నియంత గాని ఉండవచ్చును. వారంతా మనలాంటి మనుష్యులే! కాని వారికి అధికారం ధనం వంటి అసాధారణ శక్తులు ఉంటాయి. వారి అనుగ్రహాన్ని సంపాదించడానికి వారి శక్తిని ఉపయోగించుకోడానికి వారిని ఏదో విధంగా ప్రసన్నం చేసుకునేందుకు మనం ప్రయత్నిస్తాము. వారిని ఆరాధిస్తాము. భగవద్గీత ఇతర దేవతలను ఉపాసించడాన్ని ఖండిస్తుంది. ఈ శ్లోకం కేవలం కామం కోసమే మానవులు దేవతలను పూజిస్తారని స్పష్టంగా చెబుతుంది.

భౌతిక జీవితం కేవలం కామాన్ని ఆశ్రయించి ఉంటుంది. మనం ఐహిక సౌఖ్యం అనుభవించా లనుకుంటున్నాము. మన ఇంద్రియాలను తృప్తి పరచుకోడం కోసం మనం ఐహిక జగత్తును ప్రేమిస్తున్నాము. భౌతిక విషయాల పట్ల ప్రేమ దేవాదిదేవుని పట్ల మనకున్న ప్రేమకు విపరీత రూపం. నిజానికి మన మూల స్వరూపాన్ని బట్టి దేవాదిదేవుణ్ణి ప్రేమించడానికే మనం సృష్టించబడ్డాము. కాని మనం దేవాదిదేవుని మరచి, ప్రకృతిని ప్రేమిస్తున్నాము. ప్రేమించడం మనకు తప్పనిసరి. ప్రకృతినో, దేవాదిదేవునో ప్రేమించక తప్పదు. ఎలాంటి పరిస్థితులలోను ప్రేమ అనే సహజప్రవృత్తి నుంచి మనం తప్పించుకోలేము. సంతానం లేని వారు కొందరు కుక్క పిల్లనో, పిల్లి పిల్లనో పెంచుకోడం తరచు మనం చూస్తూనే ఉన్నాము. ఎందుచేతనంటే మనం దేనినో ఒక దానిని ప్రేమించకుండా ఉండలేము. మన ప్రేమను విశ్వాసాన్ని సత్యమైన వస్తువుపై నిలుపలేనప్పుడు, కుక్కల మీదనో పిల్లల మీదనో దానిని నిలుపుతాము. ప్రేమ ఏనాటినుంచో ఉంది. అయితే అది కామంగా వికృత రూపం ధరించింది. ఈ కామానికి భంగం కలిగితే అది క్రోధంగా మారుతుంది. కోపంలో మనకు సమ్మోహం కలుగుతుంది. సమ్మోహం వలన సర్వనాశనం కలుగుతుంది. ప్రస్తుతం జరుగుతున్నది అదే! అయితే మనం



ఈ మార్గాన్ని మరలించి కామాన్ని ప్రేమగా మలచుకోవాలి. మనం భగవంతుణ్ణి ప్రేమిస్తే సమస్తాన్ని ప్రేమిస్తాము. భగవంతుణ్ణి ప్రేమించలేకపోతే నిజంగా ప్రపంచంలోని ఏ ఇతర విషయాన్ని ప్రేమించడం సాధ్యం కాదు. దానిని 'ప్రేమ' అని మనం అనుకోవచ్చును కాని అది కామవాంఛకు మరొక ఆకర్షణీయమైన పేరు మాత్రమే! కుక్కల వలె విషయాసక్తులైన వారిని సర్వజ్ఞాన విమూఢులు అంటారు ('కామై స్తై స్తై ర్హృతజ్ఞానాః').

"అన్య దేవతల ఉపాసనలకు అనేక నియమ నిబంధనలు శాస్త్రాలలో కన్పిస్తున్నాయి. మరి శాస్త్రాలు వారి ఉపాసనలను ఎందుకు విధించాయి?" అని ఎవరైనా అడుగ వచ్చును. దానికి అవసరం ఉంది. కామ ప్రేరితులైన వారు దేనినైనా ప్రేమించి తీరాలి! అది వారికి చాలా అవసరం. దేవతలు దేవాదిదేవుని కింకరులు. ఈ దేవతలను పూజించేవారు క్రమంగా కృష్ణ చైతన్యాన్ని పెంపొందించుకోగలుగుతారని ఆ శాస్త్రాల ఉద్దేశ్యం. అయితే సర్వ శాస్త్రాలను ఎదిరించే సంపూర్ణ నాస్తికులకు ఇక అలాంటి ఆశ ఏముంది? కాబట్టి దేవాదిదేవుని పట్ల ప్రేమ అన్య దేవతల పట్ల ప్రేమతో ప్రారంభం అవుతుందన్న మాట!

అలా కాకుండా మనం మొదటనే దేవాదిదేవుని ఆరాధన ప్రారంభిస్తే ఇక అన్య దేవతలను అరాధించడం అనవసరం! భగవంతుని నేరుగా కొలిచే వారికి అన్య దేవతల పట్ల కూడా భక్తి భావం ఉంటుంది. కాని ఆ దేవతల వెనుక ఉండే మహాశక్తి దేవాదిదేవుడే అని వారికి తెలుసు కనుక ఆ దేవతలను పూజించడం అనవసరం అని వారు గ్రహిస్తారు. భగవంతుణ్ణి పూజించడంలోనే వారు నిమగ్నులవుతారు. అన్య దేవతల పట్ల కూడా వారికి గౌరవం ఉంటుంది. దేవదేవుని భక్తుడు చీమను కూడా గౌరవిస్తాడు. ఇక అన్య దేవతల సంగతి చెప్పేదేముంది? సర్వ ప్రాణులు దేవాది దేవుని అంశలే అని, అవి వివిధ పాత్రలను నిర్వహిస్తున్నాయని వారికి తెలుసు.

దేవాది దేవుని సంబంధం సమస్త ప్రాణి కోటికీ ఉంది. కాబట్టి జీవులందరు గౌరవార్హులు. అందుకే కృష్ణ భక్తుడు ఇతరులను 'ప్రభూ!' అని పిలుస్తాడు. దేవాది దేవునికి భక్తుడైన వాని సహజ లక్షణాలు వినయ విధేయతలు. కృష్ణ భక్తుడు దయాశాలిగా సర్వజీవ విధేయుడుగా ఉంటాడు. సకల సద్గుణాలు కలిగి ఉంటాడు. సారాంశం ఏమిటంటే - ఎవరైనా కృష్ణ భక్తుడు కాగానే అతనిలో అన్ని సద్గుణాలు వాటంతట అవే అభివృద్ధి చెందుతాయి. సహజంగా జీవాత్మ పరిపూర్ణుడే! అయితే కామ జనితమైన మాలిన్యం వలన అతడు దుర్మార్గుడవుతున్నాడు. బంగారపు కణికలోని ప్రతిచిన్న భాగం బంగారమే. అదే విధంగా పరమాత్మలో ప్రతి అంశం సంపూర్ణమైనదే!

ఓమ్ పూర్ణ మదః పూర్ణ మిదమ్ పూర్ణా త్పూర్ణ ముదచ్యతే
పూర్ణస్య పూర్ణ మాదాయ పూర్ణ మేవావశిష్యతే

"సాకారుడైన దేవాదిదేవుడు పరిపూర్ణుడు. అందుచేత ఆయన నుంచి ఉద్భవించిన ఈ దృశ్యమాన జగత్తు కూడా పరిపూర్ణమైనదే! పరిపూర్ణము నుంచి ఉద్భవించే ప్రతీది పరిపూర్ణమే! ఎన్నెన్నో అతని నుంచి ఉద్భవిస్తున్నప్పటికి ఆతడు పరిపూర్ణుడే. తన పరిపూర్ణత్వాన్ని ఎన్నడు కోల్పోడు. పరిపూర్ణుడు గానే ఉంటాడు." (ఈశోపనిషద్, శాంతి పాఠం)

ప్రకృతితో సంపర్కం ద్వారా ఏర్పడిన దోషం వలన పరిపూర్ణమైన జీవాత్మ పతనం చెందుతున్నాడు. కాని కృష్ణ చైతన్య మార్గం అతనిని మళ్ళీ పరిపూర్ణునిగా చేస్తుంది. తద్వారా అతడు సంపూర్ణానందం పొంద గలడు. భౌతిక శరీరం పతనమయిన తరువాత శాశ్వత జీవనం, అక్షయానందం, సంపూర్ణ జ్ఞానం పొంది వైకుంఠంలో ప్రవేశించగలడు.

# పరమపూజ్యశ్రీ శ్రీమత్ ఏ.సి.భక్తివేదాంత స్వామి ప్రభుపాదుల వారి పరిచయం

పరమపూజ్యశ్రీ శ్రీమత్ ఏ.సి. భక్తివేదాంత స్వామి ప్రభుపాదుల వారు భారతదేశంలోని కలకత్తా నగరంలో 1896వ సంవత్సరంలో జన్మించారు. వారు తమ ఆధ్యాత్మిక చార్యులైన శ్రీల భక్తిసిద్ధాంత సరస్వతీ గోస్వామి వారిని కలకత్తాలో 1922వ సంవత్సరంలో మొదటిసారి కలుసుకున్నారు. శ్రీల భక్తిసిద్ధాంత సరస్వతుల వారు ప్రముఖ వైదిక విద్వాంసులు, 64 గౌడీయ మఠాలను (వైదిక సంస్థలను) స్థాపించారు. వారు విద్యా సంపన్నులూ, యువకులూ అయిన ప్రభుపాదుల వారిని చూచి ఎంతో సంతోషించి, వైదిక జ్ఞానాన్ని బోధించడానికి తమ జీవితాన్ని అంకితం చేయమని ఉపదేశించారు. ఆనాటి నుంచీ శ్రీల ప్రభుపాదులు వారికి శిష్యులై పదకొండు సంవత్సరాల తరువాత యథావిధిగా దీక్ష తీసుకున్నారు.

మొదటి సమావేశంలోనే శ్రీల భక్తిసిద్ధాంత సరస్వతీ ఠాకూరు గారు ఆంగ్ల భాష ద్వారా వైదిక జ్ఞానాన్ని ప్రచారం చేయుమని శ్రీల ప్రభుపాదుల వారిని కోరారు. తరువాతి సంవత్సరాలలో శ్రీల ప్రభుపాదులు భగవద్గీతకు భాష్యం వ్రాసి, గౌడీయమఠ కార్యక్రమాలకు తోడ్పడ్డారు. 1944లో 'బ్యాక్ టు గాడ్‌హెడ్' (భగవద్దర్శనము) అనే ఆంగ్ల పక్ష పత్రికను స్థాపించారు. అది ఇప్పుడు పాశ్చాత్యదేశాలలో వారి శిష్యుల చేత ముప్ఫయి కంటె ఎక్కువ భాషలలో కొనసాగించబడుతూంది.

శ్రీల ప్రభుపాదుల భక్తివిజ్ఞానాలను గుర్తించి 1947లో గౌడీయ వైష్ణవ

సంఘం వారికి భక్తివేదాంత బిరుదు ఇచ్చి గౌరవించింది. 1950లో 54 సంవత్సరాల ప్రాయంలో ప్రభుపాదుల వారు వైవాహిక జీవితాన్ని విడిచి పెట్టారు. ఎక్కువకాలం గ్రంథాలను చదవడానికీ, వ్రాయడానికీ వినియోగించ సాగారు. తరువాత వారు వృందావనానికి వెళ్ళి అక్కడ మధ్యయుగంలో చరిత్ర ప్రసిద్ధి కెక్కిన రాధా దామోదర దేవాలయంలో అతి నిరాడంబర జీవితం గడిపారు. అక్కడే వారు చాలా సంవత్సరాలపాటు ఉండి ఎంతో విద్యా వ్యాసంగం చేసి అనేక గ్రంథాలు వ్రాశారు. 1959లో సన్న్యాసాశ్రమాన్ని స్వీక రించారు. తమ జీవిత ముఖ్య రచన అయిన శ్రీమద్భాగవతంలోని 18,000 శ్లోకాలకు అనువాదం, వ్యాఖ్యానం అనేక సంపుటాలుగా వ్రాయడం ప్రారంభిం చారు. గ్రహాంతర సులభయానం అనే మరో గ్రంథాన్ని కూడా వ్రాశారు.

శ్రీమద్భాగవతం మూడు సంపుటాలు ప్రచురించాక ప్రభుపాదుల వారు తమ ఆధ్యాత్మిక ఆచార్యుల కోరికను నెరవేర్చడానికి 1965లో అమెరికా సంయుక్త రాష్ట్రాలకు వెళ్ళారు. అప్పటి నుంచీ వారు భారతీయ వేదాంత గ్రంథాలపై ప్రామాణికాలైన వ్యాఖ్యానాలూ, భాషాంతరీకరణాలూ, సంగ్రహ వ్యాఖ్యలూ 70 సంపుటాలకు పైగా వ్రాశారు.

1965లో మొట్టమొదటిసారిగా ఒక వాణిజ్యనౌకలో న్యూయార్కు నగరానికి వెళ్ళినప్పుడు వారిదగ్గర ఒక్కపైస కూడా లేదు. తరువాత ఒక సంవత్సరానికి అంటే 1966 జూలైలో వారు అతికష్టం మీద అంతర్జాతీయ కృష్ణచైతన్య సంఘాన్ని (ఇస్కాన్) స్థాపించగలిగారు. పది సంవత్సరాల లోపలే ఆ సమాజం బాగా అభివృద్ధి చెంది ప్రపంచమంతటా వ్యాపించసాగింది, పాఠశాలలు, దేవాలయాలు, ఆశ్రమాలు మొదలైన వాటిని నెలకొల్పసాగింది.

1968లో శ్రీల ప్రభుపాదుల వారు న్యూవర్జీనియాలోని కొండల మీద ఆధ్యాత్మిక సమాజాన్ని స్థాపించి దానికి నూతన వృందావనం అని పేరు పెట్టారు. అక్కడే ఒక వైదిక పాఠశాలను నెలకొల్పి పాశ్చాత్యదేశాలకు సైతం వైదిక గురుకుల విద్యావిధానాన్ని అందుబాటులోకి తెచ్చారు. ఆ నూతన వృందావనం ఇప్పుడు వేయి ఎకరాలకు పైగా వైశాల్యం గల ప్రదేశంలో విరాజిల్లుతుంది. అమెరికాలోని వారి శిష్యులు అలాంటి సంఘాలను చాలా వాటిని స్థాపించారు.

1972లో పరమపూజ్యశ్రీ శ్రీమత్ ప్రభుపాదులవారు పాశ్చాత్య దేశాలలోని డెల్లాస్, టెక్సాస్‌లలో వైదిక పద్ధతిలో గురుకులాలను ఏర్పాటు చేశారు. 1972లో ముగ్గురు విద్యార్థులతో ప్రారంభమైన గురుకులం 1975 నాటికి 150 మంది విద్యార్థులతో విరాజిల్లింది.

శ్రీల ప్రభుపాదులవారు భారతదేశంలో చాలా అంతర్జాతీయ కేంద్రాలను నిర్మింపచేయడానికి ప్రోత్సహించారు. పశ్చిమబెంగాలులోని మాయాపూర్‌లో శ్రీ ధామమనే అంతర్జాతీయ ఆధ్యాత్మిక కేంద్రాన్ని నిర్మించ తలపెట్టారు. అతివిస్తృతమైన ఆ పథక నిర్మాణానికి చాలా కాలం పట్టవచ్చును. అది వైదిక శాస్త్ర పఠనానికి కూడ అనుకూలంగా నిర్మించబడింది. భారతదేశంలోని వృందావనంలో మహోన్నతమైన కృష్ణబలరామ దేవాలయం ఆ పద్ధతుల ప్రకారమే నిర్మించబడింది. అక్కడ ఒక అంతర్జాతీయ అతిథిగృహం కూడ నిర్మించబడింది. పాశ్చాత్యులక్కడ నుంచి వైదిక సంస్కృతిని స్వయంగా నేర్చుకునే అవకాశం ఉంది. బొంబాయిలో ప్రధాన సాంస్కృతిక విద్యాకేంద్రం కూడ ఉంది. భారతదేశంలో సుమారు పద్దెనిమిది ముఖ్యస్థానాలలో ఇతర కేంద్రాల నిర్మాణం కొనసాగుతూంది.

శ్రీల ప్రభుపాదుల వారి ముఖ్యాతిముఖ్యమైన సేవ గ్రంథరచన. దాని ద్వారా వారు ఎంతో ప్రసిద్ధి పొందారు. వారి గ్రంథాలు ప్రామాణికత్వానికీ, జ్ఞాన గాంభీర్యానికీ, వైశద్యానికీ పెట్టింది పేరు. అవి విద్వాంసుల చేత ఎంతగానో గౌరవించబడ్డాయి. అనేక కళాశాలల్లో పాఠశాలల్లో ప్రామాణిక పాఠ్యగ్రంథాలుగా నిర్ణయించబడ్డాయి. వారి రచనలు ఎనభైకి పైగా భాషలలోకి

అనువదించబడ్డాయి. ప్రభుపాదుల వారి గ్రంథాలను ముద్రించి, ప్రకటించడం కోసమే 1972లో భక్తివేదాంత బుక్ ట్రస్ట్ అనే సంస్థను స్థాపించారు. అది ఇప్పుడు భారతీయ మతతత్త్వ విషయాలపై గ్రంథాలను ప్రచురించే ప్రపంచ ప్రముఖ ప్రచురణ సంస్థగా రూపొందింది.

వార్ధక్యం సమీపించినా సుమారు పన్నెండు సంవత్సరాలలో శ్రీల ప్రభుపాదుల వారు ప్రపంచమంతటా పద్నాలుగుసార్లు ఉపన్యాసయాత్ర సాగిస్తూ ఆరుఖండాలలో పర్యటించారు. అంతటి నిర్విరామ కార్యక్రమాలలో నిమగ్నులై ఉన్నప్పటికీ వారు తమ గ్రంథ రచనను కొనసాగిస్తూనే ఉండేవారు. వారి గ్రంథాలన్నిటినీ కలిపితే ఒక ప్రఖ్యాత వైదిక వేదాంత మత సాహిత్య సంస్కృతీ గ్రంథాలయం అవుతుంది.

1977 నవంబరు 14వ తేదీన వారు ఉత్తరప్రదేశ్‌లోని వృందావనంలో దివంగతులయ్యేవరకూ నిర్విరామంగా శ్రమించారు,ప్రపంచమంతటా వందకు పైగా ఆశ్రమాలనూ, దేవాలయాలనూ సంస్థలనూ స్థాపించి కృష్ణ చైతన్య సంఘాన్ని అంతర్జాతీయ సంస్థగా (ఇస్కాన్) తీర్చిదిద్దారు.



## అంతర్జాతీయ శ్రీకృష్ణ చైతన్య సంఘం (ఇస్కాన్)

(సంస్థాపక ఆచార్యులు : పూజ్యశ్రీ ఏ.సి. భక్తివేదాంత స్వామి ప్రభుపాదులు)

### అందరినీ ఆహ్వానిస్తోంది!

కృష్ణచైతన్య సాధన ద్వారా శ్రీకృష్ణ భగవానుని భక్తుడు కావడమే మానవ జన్మ లక్ష్యం. ఈ లక్ష్యసాధనకై ఈ క్రింది విధులూ, నిషేధాలూ తోడ్పడుతాయి. వీటిని ఈ సంఘంలో చేరి కాని, ఇంటివద్ద కాని పాటించవచ్చు.

విధులు :

1. శ్రీచైతన్య మహాప్రభువు ప్రసాదించిన :
   "హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే
   హరే రామ హరే రామ రామ రామ హరే హరే"
   అనే మంత్రాన్ని 108 పూసలున్న తులసిమాలతో నిత్యం 16 సార్లు జపించాలి.
2. శ్రీ భగవద్గీత, శ్రీమద్భాగవతం బోధించిన ఉపదేశాలను అనుసరించి పూజ్యశ్రీ ఏ.సి. భక్తి వేదాంత స్వామి ప్రభుపాదుల వారు రచించిన గ్రంథాలను అధ్యయనం చేసి, వాటి ప్రకారం భగవత్ కైంకర్యం చేయాలి.

నిషేధాలు :

1. మాదక ద్రవ్యాలు సేవించరాదు (టీ, కాఫీ, పొగాకు, గంజాయి, భంగు, మద్యం, మొ॥ మాదక పదార్థాలను పూర్తిగా వర్జించాలి).
2. అభక్ష్య భక్షణం చేయరాదు (మాంసం, చేపలు, గుడ్లు, నీరుల్లి, వెల్లుల్లి వంటి తామసిక ఆహార పదార్థాలను వర్జించాలి).
3. నిషిద్ధమైన లైంగిక సంపర్కం పనికిరాదు.
4. ఏ విధమైన జూదం ఆడరాదు.

సర్వస్వం త్యజించి ఇస్కాన్‌లో చేరిన వారికి ఇక్కడి పవిత్ర వాతావరణంలో శిక్షణ ఇవ్వబడుతుంది.

వివరాలకు :

మీ దగ్గరలోని 'ఇస్కాన్' కేంద్రాన్ని సంప్రదించండి: లేదా 'కార్యదర్శి, ఇస్కాన్ (ISKCON), హరేకృష్ణ ల్యాండ్, నాంపల్లి స్టేషన్ రోడ్, హైదరాబాద్ - 500 001' అనే చిరునామాకు వ్రాయండి.